# ఆధునిక ఆంధ్ర కవిత్వంలో అనర్ఘమణులు—1

**ముత్యాల సరాలు**

> "దేశ మనియెడి దొడ్డ వృక్షం
> ప్రేమ లను పూ లెత్త వలెనోయి,
> నరుల చమటను తడిసి మూలం
> ధనం పంటలు పండవలెనోయి!"

"ఇప్పటివరదాకా తెలుగు పద్యరచన వ్యవహారమున నశించిన పాత పదజాలముతో కొనసాగుతూ వస్తోంది అందువల్ల మామూలు వాడుక మాటలకు కవితలో అర్థస్ఫూర్తి కలిగే యోగ్యత పట్టడం లేదు ఇక మనం నూతన కావ్యశైలిని అనుసరించాలి ఒక పదాన్ని కావ్యంలో ప్రయోగిస్తున్నప్పుడు దాని కొక వింత అందం వస్తుంది వ్యావహారిక భాషాపదాలను సులువుగ, యథేచ్ఛగ ఇముడ్చుకునే ఛందస్సులను మనం సృష్టించుకోవాలి"

—గురజాడ ('లేఖలు'—పే 202-3)

## గురజాడ అప్పారావు
(30-11-1861—30-11-1915)

పుట్టింది విశాఖజిల్లా, ఎలమంచిలి తాలూకా, రాయవరంలో చదువు సాగించింది చీపురుపల్లి (స్కూలు), విజయ నగరాలలో (హైస్కూలు-కాలేజీ) చదువు కుంటున్నప్పుడే ఇంగ్లీషులో పద్యాలు రాస్తూండేవారు మెట్రిక్యులేషను, బి ఏ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు ఆంధ్ర, సంస్కృత, ఆంగ్ల భాషలలో మంచి పాండిత్యం గడించారు

ఉద్యోగాలు ఉపాధ్యాయుడుగా, (ఆనంద గజపతి మహారాజు అభిమానం సంపాదించి) లెక్చరరుగా, సంస్థాన శాసన పరిశోధకునిగా, (ఆనంద గజపతి సోదరి) రీవా మహారాణి అంతరంగిక కార్యదర్శిగా, పురపాలక సంఘ సభ్యునిగా, మద్రాస్ యూనివర్సిటీ సెనేట్ మెంబరుగా రచనలు నాటకాలు ('కన్యాశుల్కం', పూర్తిచెయ్యని 'కొండుభొట్టీయం', 'బిల్హణీయం'), కవితలు (నీలగిరిపాటలు, ముత్యాల సరాలు, సుభద్ర), కథానికలు, సాహిత్య-విద్యావిషయిక వ్యాసాలు

# గురజాడ అప్పారావు

POCKET BOOKS
EMESCO
187

యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం. మద్రాసు. సికింద్రాబాద్

MUTHYALA SARALU

By

GURAJADA APPA RAO

Publishers

M SESHACHALAM & CO

First Edition

'EMESCO POCKET BOOKS

JANUARY 1972

Cover Design

BAPU

Printers

KRANTI PRESS, Madras-1

Distributors

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,

RASHTRAPATHI ROAD, SECUNDERABAD

Price Rs 2-50

187

# విషయసూచిక

## సుభద్ర



## అనుబంధము

# "రసగీతాలు"*

నవ్యకవుల గురుప్రవర చెప్పవలసివస్తే, రాయప్రోలు సుబ్బారావుగారి పేరుకంటె గురజాడ అప్పారావుగారి పేరే ముందుగా నోటికి వస్తుంది
వారిలో ఆయనే 'కనిష్ఠికాధిష్ఠితుడు'

తన భౌతిక శరీరంలాగే గురజాడ కావ్య శరీరం కూడా రాశిలో కొద్దిపాటిదే పట్టుమని పది రచనలైనా తాను చెయ్యలేదు అయినా ఆ చేసినవే చాలు, పదికాలాల పాటు నిలపడానికి అవి బచ్చెనబొమ్మలు కాదు, ప్రాణం తొణికిసలాడే కోమలులు రసం చిప్పిల్లే తెలుగు జానపదగేయాల భణితిని గురజాడ సొంతపరచుకొన్నాడు అరిగి చెరిగిన కావ్య భాషా శబ్దాలను ప్రయత్నపూర్వకంగా క్రమక్రమంగా విడిచి వేస్తూ, నోటికి ఒదిగే మాటలను వెదికివెదికి పట్టుకొని కావ్యాల్లో నిలిపాడు సంభాషణచ్ఛాయలను కావ్యచరణాలకు పట్టించాడు ఇది అక్షరాలా ఒక అపూర్వమైన సిద్ధి—అక్షరసిద్ధి

బతికి ఉండిన రోజుల్లోనూ అటుతర్వాతనూ తాను పండితుడని పేరు సంపాదించుకోలేదు అందువల్లనే బతికిపోయాడు లేకుంటే గంగిరెద్దుమీది చిరుగుబట్టల మేటల్లా కవిసమయాలనూ అలంకారాలనూ తన 'కోమల కావ్యకన్యక'మీద వెయ్యవలసివచ్చేది తన భౌతికజీవితం ముగింపుకు రాసాగిన కాలంలోనే పుంఖానుపుంఖంగా కావ్యాలను సృష్టించి పత్రికలద్వారా ప్రపంచంమీదికి కోకిలల్లా పావురాల్లా విడిచి పెట్టసాగాడు అప్పటికే తాను 'కన్యాశుల్కం' నాటకాన్ని రెండోసారిగా కూడా రాసి ఉన్నాడు అప్పటికే ఒక విశిష్టమైన జీవితతత్త్వాన్ని సిద్ధింపజేసుకొని ఉన్నాడు. అప్పటికే భాషా కురుక్షేత్రంలో గిడుగు

---

* నవ్యసాహిత్య పరిషత్తు సభలో విశ్వనాథ సత్యనారాయణగారి వర్ణన

పండితుడు నారాయణుడు కాగా తాను నరుడై ఉన్నాడు అప్పటికే దేశ దేశాంతర సాహిత్య ఫలాలను రుచిచూచి ఉన్నాడు ఆ నాటకీయ దృష్టి, ప్రేమపూర్ణమైన సౌజన్యం, ప్రజా భాషపట్ల మాతృభావం, స్వాదువైన సాహిత్యాభిరుచి—ఇవన్నీ గురజాడ కావ్య సంతానానికి గల మొక్కట్లు నాటికీ నేటికీ ఈ మొక్కట్లు కలిగిన కావ్యవ్యక్తి మరొకటి తెలుగునాట కనిపించదు

"అప్పారావు వాస్తవంగా ఆంధ్ర వాఙ్మయాకాశం మీద ధ్రువతార అది అనశ్వరం మాత్రమే కాదు స్వయంప్రకాశకం కూడాను

"గురజాడ అప్పారావు పంతులు ఆంధ్ర వాఙ్మయంలో కొత్త పోకడలు చూపిన ధీశాలి అతన్ని మనం మరచి పోతే అది చాలా దౌర్జన్యంలో చేరిపోతుంది"

నలభై ఏళ్ళ కిందట 'భారతి'లో 'శాస్త్రి' అనే కలంపేరుతోటి శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి రాసిపోయిన మాటలివి చాలా సంయమనంతోటి నిజాయితీతో చెప్పిన మాటలు

గురజాడ అప్పారావును కవిశేఖరుడనీ మరో వాల్మీకి అనీ ప్రస్తుతించి, వెనువెంటనే అతని అడుగు జాడలనుంచి తప్పుకొని మళ్ళీ గ్రాంథికభాషా ప్రాచుర్యానికి కావ్యరంగంలో చోటు కల్పించారు 'నవ్య' కవులు అనేకులు బసవరాజు అప్పారావు, చింతా దీక్షితులు లాంటి ఏ ఒకరో ఇద్దరో తప్ప తక్కిన వాళ్ళంతా కోకిలమ్మ పాటలు గాకుండా చిలక పలుకులకు మనసయ్యారు

"అప్పారావు గారిని మెచ్చుకోనివారు ఆంధ్ర కవులలో నేనెరిగినంత మట్టుకు ఎవరూ లేరు నేడు కావ్యములు వ్రాసే యువకులందరూ ఆయనను మార్గదర్శిగా అంగీకరించిన వారే కాని ఏ కారణముచేతనో వారు భాషా విషయములోనైతే నేమి, రచనా విషయములోనైతేనేమి, అప్పారావుగారికి శిష్యులుగానే నడుస్తున్నారని అనక తప్పదు"

రాజమండ్రిలో జరిగిన నలభై ఏళ్ళ కిందటి గురజాడ సంస్మరణ

సభలో అధ్యక్షస్థానం నుంచి చింతా దీక్షితులు చెప్పిన మాట లివి వీటిలో వేదన మిళితమై ఉంది

అయినా అప్పారావు ప్రభావం 'నవ్య' సాహిత్యంలో వృక్ష కాండంలో జీవసారంలా, విశాల ప్రకృతిలో సూర్యరశ్మిలా ఉంటూనే వచ్చింది కాకుంటే అంతర్లీనంగానో నిత్య సత్యంగానో ఉండి పోయింది తప్ప ప్రస్ఫుటం కాలేదు ఖండకావ్య ప్రక్రియ, గేయగుణం, ఆత్మాశ్రయత్వం, నవ్యతా దర్శనం—ఇవన్నీ నవ్య కవులకు గురజాడ పెట్టిన భిక్ష, అక్షయభిక్ష

## 2

వీరేశలింగం సంఘంలో లేవదీసిన విప్లవ తరంగంమీది నురుగే గురజాడ అప్పారావు సాహిత్యం సమస్తం అభినవ భావచైతన్యం ఒకరిలో సంఘ సంస్కరణనీ, మరొకరిలో సంఘ సంస్కరణ పరాయణమైన సాహిత్యసృజననీ ప్రేరేపించింది అయితే ఒకరికొకరు నకలుకాదు ఎవరి పనికి వారిపనే ఈడి. వెరసి ఇద్దరూ ఒక కత్తికిగల రెండంచులు ఆకత్తి లోకజీవితమే

వీరేశలింగంకంటె వయస్సులోనూ, క్రియాపాటవం లోనూ అప్పారావు చిన్నవాడు మనస్వితలో మాత్రం ఎవరికివారే వీరేశలింగం వీరసంస్కర్తకాగా, అప్పారావు గొప్ప సంస్కారి వీరేశలింగం ముట్టుకుంటే మండే నిప్పుకాగా, అప్పారావు నివురుగప్పిన నిప్పు వీరేశలింగం ప్రతిపనిలోనూ పట్టువిడుపులులేని ఉగ్రమైన కర్కశత్వం కనిపిస్తే, అప్పారావు ప్రతి రచనలోనూ లౌక్యం అనిపించే వెసులు బాటు ఎదురౌతుంది వీరేశలింగం మతతీవ్రత అప్పారావులో మానవీయ ప్రసన్నతగా పరిణమించింది సామాన్యులకు అలవికాని మహోన్నత ఆదర్శశిఖరంతో తనకు పని లేదు తనది మానవుడి మనస్సులోని అగాధంనుంచి మంచినీ, మేలిమినీ వెలికిదీసి సమతలంలో సంచరింప జేసే దృక్పథం మాత్రమే చెడుని తాను ఈసడించడు. రోగంతో బాటు రోగినికూడా అంతరింపజెయ్య గోరడు తాను యముడు కాదు,

వైద్యుడు కాబట్టే విమర్శను శస్త్రికగా ప్రయోగించి, చిత్తసంస్కా-రానికి ప్రయత్నించగోరుతాడు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు—ఇలా పరస్పర లోపపూరకులు అందుచేతనే ఒకరి కొకరు మంచి జత

"నేడు వివిధశాఖలలో దేశారాధనం చేసిన వారూ లేక చేస్తూ ఉన్నవారూ వ్యక్తులు అందరూ ప్రత్యక్షంగానో, పరోక్షం గానో వారి శిష్యులే అనవచ్చు"

అన్నారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి స్వదేశీయుల "ఆత్మవిస్మృతి"ని తొలగించి "ఆత్మవిశ్వాస సూర్యోదయంబు" ఘటిల్ల జెయ్యడంవల్లనే ఆ ఇద్దరున్నూ చరితార్థులయ్యారు వారిని great enfranchisers అనవచ్చు

౩

ఈ ఇద్దరిలో అంతరం ఎంచవలసివస్తే, అప్పారావే అచ్చమైన ఆధునికుడు మతవిశ్వాస యుగాన్ని దాటుకొని హేతుచింతనా యుగా నికి వీరేశలింగంకంటె అప్పారావే ముందు వచ్చి చేరుకొన్నాడు కుందేలు మతంమజిలీలో విశ్రమిస్తే, తాబేలు జ్ఞానమనే గమ్యాన్ని ముందుగా చేరింది వీరేశలింగంలోకూడా హేతుచింతన ఉందిగాని, అది అప్పారావులో పూర్తిగా విప్పారింది

మతము లన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును
అంత స్వర్గసుఖంబు లన్నవి
యవని విలసిల్లున్

దైవవశాన, "కవుల కృపగని", యింగిలిషు చదువుల పుణ్యమా అని, తన కావ్యకథానాయకుడిలాగే అప్పారావుకూడా కళ్లను ఒల్లకుండా సత్యాన్ని ఆరయడం ప్రారంభించి కృతార్థుడు కాగోరాడు ఆ సత్యదీప్తిలో తనకొక ఉజ్జ్వలమైన లోకదృశ్యం కనిపించింది జాతిబంధాలు తుప్పుపట్టిన గొలుసులై ఊడివస్తున్నాయి వర్ణభేదాలు

కల్ల లౌతున్నాయి. ప్రేమ అపారం మహాసాగరమై మనస్సులను కలుపుతూ, సౌజన్యాన్ని సృష్టిస్తూ యెల్లలోకాన్ని వొక్కయిల్లుగా మార్చివేస్తున్నది అయితే ఈ అద్భుత పరివర్తన యావత్తున్నూ వర్తమాన కాలంలోగాక, సమీప భవిష్యత్తులోనే కలగబోతున్నది అదిన్నీ "మేటివారల మాట లనియెడి మంత్రమహిమ" చేతనే!

ఈ ఊహాదర్శనం (vision) అప్పారావు కవి వ్యక్తిత్వాన్ని అనన్యంగా పట్టి ముద్రగొట్టి సమకాలికులైన మనస్వులకంటె ఎంతో కొంత ఎత్తున నిలుపుతుంది ప్రపంచాన్ని దాని మానానికి వదిలి స్వదేశం వద్దకు వచ్చి నిలిచినప్పుడున్నూ ఈ కాల్పనిక ప్రవృత్తే, స్వప్నపరవశతే, ఎదు రౌతున్నది అయితే స్వప్నానికి గూడా యాథార్థ్యంనుంచి స్వతంత్రమైన ప్రతిపత్తి ఉండదు, కల్పన గూడా నేల విడిచి సాము జెయ్యదు తన యుగంలో సంఘంలో పైకెక్కి రాసాగిన విద్యాధికమైన మధ్యమవర్గమే అప్పారావు ముఖతః తన కోరికలనూ, కామనలనూ వెల్లడించుకొంది ప్రారంభకాలంలోనైనా ఈ మధ్యమవర్గ భావవైఖరి అభ్యుదయాత్మకంగా పురోగమన శీలం కలిగి ఉంటుంది. సంఘంలో తన కంటె కింది మెట్టున ఉన్న వర్గాల నన్నిటినీ కూడ గట్టుకొన్నట్టుగా, వాటన్నిటికీ తానే ప్రతినిధి నన్నట్టుగా, వ్యవహరిస్తూ ఉంటుంది తత్కాలానికి తాను చూసిందే తదితరుల కందరికీ మేలిబాట గురజాడ 'దేశభక్తి' గేయం మధ్యమవర్గం ఆశయ ప్రకటన పత్రం! భూస్వామ్య యుగ ప్రాభవానికి అది స్వస్తి, ధనస్వామ్య యుగానికి నాంది అప్పటికి అదే మహాభ్యుదయం

> వెనక చూసిన కార్యమేమోయి?
> మంచి గతమున కొంచెమేనోయి
> మందగించక ముందు అడుగేయి
> వెనకపడితే వెనకేనోయి!

జాతీయత—"వాతం"—భిన్నమతాలను మీరి సమైక్య సౌధంగా పైకి లేస్తున్నది 'స్వదేశీ' ఉద్యమం దేశీ సరుకుల ఉత్పత్తిని ప్రోత్సహిస్తున్నది ఔదాత్యంకంటె డబ్బుకు ఎక్కువ మన్నన కలుగుతున్నది

వ్యాపారం మీద నిర్బంధాలు సంకట మౌతున్నాయి  పని అపూర్వ గౌరవం పొందుతున్నది ధనాధిపతి వెంట కష్టజీవి చరిత్రరంగం మీదికి వచ్చి నిలుస్తున్నాడు  అతని "చమటను తడిసి మూలం," దేశమనే దొడ్డ వృక్షం ధనం పంట పండిస్తే, అది పరాయత్తం కాక తప్పదం లేదుగాని, వెనకటిరోజుల గొడ్డుచాకిరీతోటి పోలిస్తే ఇది గుడ్డిలో మెల్ల కష్టజీవి వ్యక్తుడౌతున్నాడు  శక్తిగా మార్పుచెందుతున్నాడు  అయితే గురజాడ అప్పారావు మనస్సు శ్రామిక రాజ్యాన్ని కోరేంత ముందుకు ఎలాగూ సాగలేదు  సాగజాలదు కాబట్టే  సాగలేదు  తాను మనస్వి అయినా మనస్సుకు గూడా కాలిక పరిమితులు తప్పవు

## 4

కుటుంబ వ్యవస్థలో గూడా అప్పారావు పెనుమార్పునే ఆహ్వానించాడు  పురుషాధిక్యం నుంచి తన మనస్సు బయటపడింది  భార్యాభర్తల మధ్య సేవ్యసేవక సంబంధం ఉన్నంతకాలం, కుటుంబానికి నిజమైన కుదురుబాటు ఉండదు  స్త్రీ మేలుకోవాలి, లేచి ఎదురు తిరగాలి అని తాను ఒకచోట నోరు విడిచి అని ఉన్నాడు  వ్యక్తిత్వాన్ని సంపాదించుకొని మగవాడితో సమానత్వాన్ని స్థాపించుకోవడం కోసమే గాని, ఎదురు తిరగడం కోసం ఎదురు తిరగడం మాత్రం  కాదిది  దీనికి సాంప్రదాయికపు విలువలు  అడ్డం వస్తున్నాయి  కాబట్టి వాటిని తోసివెయ్యక  తప్పదు  పతివ్రతల చరిత్రలు వెలువడు తూండిన కాలంలో—

మగడు వేల్పన పాతమాటగి,  
ప్రాణమిత్రుడవ నీకు—

అనగలిగిన వ్యక్తిని  అప్పారావు  ఊహించుకొన్నాడు  ఇది ఆనాటి సంఘానికి అపరిచితమైన ఊహ  దీనికి పునాది "ప్రేమ" మనిషికీ మనిషికీ మధ్య, మనస్సుకూ మనస్సుకూ మధ్య ఈ అద్భుత పదార్థం సిమెంటులా పనిచేస్తుంది  భార్యాభర్తల మధ్య ఉండదగింది కూడా ఇదే  అదిలేక వివాహ బంధం బానిస బంధమే

వివాహం ఏకపక్ష వ్యవహారంగా ఉన్నంతకాలం, సంఘానికి క్షయమేగాని అభ్యుదయం ఉండదు కన్యాశుల్క పద్ధతి మూలంలోనే కుళ్ళింది వీరేశలింగం కుండబద్దలేసి చెప్పినట్టుగా అది 'నరమాంస విక్రయం' కిందనే జమ. ఆనంద గజపతి పురమాయించిన పనివల్ల ఈ పద్ధతిలోని దుర్భరమైన విషాదం అప్పారావు గుండె లంటుకు పోయి నాటకాన్ని రాయించడమేగాక, అశ్రుపూర్ణమైన పాటలు కూడా రాయించింది అయితే వీరేశలింగం భయంకరంగా శపిస్తే, అప్పారావు సానునయంగా చెప్పాడు రౌద్రానికి కరుణాన్ని సమకూర్చాడు ప్రచండ భార్గవాన్ని ప్రసన్న భార్గవంగా మార్చాడు తాను సంస్కర్త కాకున్నా, సంస్కరణాభిమాని కార్యశూరుడు గాకున్నా, సరసుడైన సంస్కారవంతుడైన కవి కాబట్టే వీరేశలింగం ప్రహసనాలకు చేకూరని సాహిత్య గౌరవం అప్పారావు నాటకానికీ, "ఆడపిల్లల పాటల"కూ చేకూరింది

కన్నీటి కుండలైన కళ్ళతోటి అన్నదమ్ములనూ, అక్కచెల్లెళ్ళనూ సమీపించి పూర్ణమ్మ చెప్పిన హితవు కిటికిరాతిని కూడా కరిగించి వేస్తుంది కన్నబిడ్డను కాసుకలోనై ముదుసలి మగడికి ముడి వేసిన కిరాతక హృదయులైన అయ్యనూ, అమ్మనూ సేవించమంటుంది ఋతువు ఋతువునా పళ్ళనూ, పూలనూ అందుకొని గూడా అక్కరకు రాని వేలుపైన దుర్గను కొలవ మంటుంది

నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొకతరి తలవండి,
మీ మీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి

తాను ఉసురు తీసుకొనేందుకు నిశ్చయించుకొంది బతికి ఉన్న వాళ్ళను గురించి తాపత్రయ పడుతోంది విచిత్ర పరిస్థితి కాబట్టే—

పూర్ణమ్మ చనిపోలేదు ఆమెది ఆత్మహత్య కాదు భర్త యింటికి పోవడానికి మారుగా లోకేశ్వరి ఇంటికి పోయింది ప్రకృతినుంచి తాను స్వీకరించిన ద్రవ్యాలను తిరిగి ప్రకృతికే ఇచ్చివేసింది అది విడుదల గ్రహణం విడుపు

కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి జేరెను మేని పసల్ !
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ

ఈ వర్ణన అప్పారావు కవిత్వశక్తికి పరాకాష్ఠ "చిన్న పదములతో పెద్ద భావములను ఇమిడ్చే శక్తి వీరికి ఎక్కువగా గలదు," అని చింతా దీక్షితులు చెప్పింది పరమ సత్యం.

పురుషాధిక్యం మాత్రమేగాక, అధికారం అహంకారం కూడా మూర్తీభవించిన ఒకానొక రాజు కన్యక చేతిలో ఎలా దురంతం పాల య్యాడో తలచుకొంటేనే భయం వేస్తుంది

పట్టమేలే రాజు గర్వం
మట్టి గలిసెను, కోట పేటలు
కూలి, నక్కల కాటపట్లై
అనురె

ఈ రెండు గేయాల ముగింపులూ ఎంత క్లుప్తంగా ఉన్నాయో అంతశక్తిమంతంగా ఉన్నాయి ఒక చిత్రం ఒక్క ముందు మెదిలి కదిలి పోతుంది కాబట్టే ఇవి "గ్రాఫిక్"గానే కాదు, "సినిమాటో గ్రాఫిక్‌గా" ఉన్నాయని శ్రీశ్రీ వర్ణించారు

'యోగ వాసిష్ఠం' నుంచి లవణుడి ఉపాఖ్యానాన్ని స్వీకరించి శాంత, శృంగార, అద్భుత రసాలను పోషిస్తూ 'లవణరాజు కల' అనే పెద్ద గేయం రాశాడు గ్రీక్ చరిత్రనుంచి ఇద్దరు ప్రాణమిత్రుల ఉదంతాన్ని తీసుకొని 'డామన్ - పిథియస్' రాశాడు. ఇంగ్లీషు కవి రాబర్ట్ బ్రౌనింగ్ పద్ధతి అరువు తెచ్చుకొన్నట్టు, 'కాసులు' అనే

గేయంలోనూ ఈ రెండింటిలోనూ సంభాషణ చాతుర్యాన్ని కావ్యస్థం చేశాడు తిక్కన విరాటపర్వాన్ని అధ్యయనం చెయ్యడం కూడా ఇందుకు తోడుపడి ఉంటుంది ఇక మాటల ఎంపిక విషయంలో, పనిగట్టు కొన్నట్టుగా, సంస్కృత శబ్దాలనూ సమాసాలనూ వీలైనంతవరకు దరికి రానీయకుండా జాగ్రత పడినట్టు, ఆయన వచన వివరణమే తెలియ జేస్తుంది చెవికి మృదువుగా ఉండడమనేది ముఖ్యమైన గీటురాయిగా పెట్టుకొన్నాడు కాబట్టి శబ్ద దోషా లనిపించే ప్రయోగాలకు గూడా వెనకాడలేదు ఈ దోషాల గురించి తనకు కొంతైనా స్పృహలేకుండా పోలేదు అయితే వాటినే చూసి అప్పారావు రచన నంతటినీ కలం గీటుతో కొట్టివేసి "అకవి" అనడం అన్యాయం

"అప్పారావు రచనలను చేతబట్టి శబ్దరూపాలు మాత్రమే పరిశీలించేవాడు రసికుడు కాడు, పండితుడూ కాడు, చివరికి వాఙ్మయం అంటే అభిరుచి కలవాడు కూడా కాడు"

ఈ మాట లన్నది శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

## ౨

'ముత్యాలసరం' అనే కొత్త ఛందో రూపాన్ని సృష్టించినందు వల్ల మాత్రమే గురజాడ అప్పారావు ఆధునికాంధ్ర కవిత్వానికి ఆద్యు డని అంటే, ఎవరైనా నవ్విపోగలరు కావ్యభాషను సంస్కరించినంత మాత్రాన కూడా కాదు యుగహృదయం మరెవ్వరి కవితలోనూ ఇంత నిండుగా దండిగా స్పందించలేదు కాబట్టె, సమకాలికమైన సామాజిక పరిణామానికీ ఆ గురజాడ కవితాత్మకూ అనన్యమైన ఒద్దిక కుదిరింది కాబట్టే, మనసావాచా అప్పారావు ఆధునికుడు కాబట్టే, ఆద్యుడు కాగలిగాడు కండగల జాతీయమైన భాషను వాడడం, రసపుగూఢైన వాడుక పలుకుబడుల సూక్ష్మ మెరిగి ప్రయోగించడం, హృదయానికి హత్తుకుపోయే పాత ఛందస్సుకు కొత్త చెలామణీ కలిగించడం— ఇవన్నీ అసలు దానికి హంగులు.

# 6

ఈ 'ఎమెస్కో' ఎడిషన్ తయారు చెయ్యడంలో నను 1929 లో గురజాడ వెంకటరామదాసు, 1939 లో రామానుజాచార్య విద్యాసమితి, 1947 లో ప్రజాశక్తి ప్రచురణాలయం, 1950 లో వావిళ్ళవారు, 1953 నుంచి 1972 దాకా విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రకటించిన ప్రతులను సంప్రదించడం జరిగింది అలాగే 'కృష్ణాపత్రిక', 'ఆంధ్ర భారతి' వంటి పత్రికల పాత సంచికలను గాడా తిరగవేశాను అప్పారావు స్వహస్త లిఖితమైన ప్రతి లభించనప్పుడు ఇలాంటి ఇతర ఆధారాలే పాఠ నిర్ణయానికి శరణ్యాలయ్యాయి వీటన్నిటిలోకి మొదటి రెండే ఎక్కువ ప్రమాణం

అప్పారావు రచనలను అచ్చు వేసేప్పుడు, తమకు దోషాలని తోచిన శబ్దరూపాలను 'ప్రజాశక్తి ప్రచురణాలయం' సంపాదకులు సవరించబూనారు కొంతవరకు 'విశాలాంధ్ర ప్రచురణాలయం'వారు ఆ దారినే పట్టిపోయినా కొంత మెలకువ చూపారు 1972 జనవరిలో వెలువడిన విశాలాంధ్రవారి 'ముత్యాల సరాలు' ఆరవముద్రణ ఈ లోపాలను చాలవరకు తొలగించుకో గలిగింది

వావిళ్ళవారి ప్రతిలో ముఖ్యమైన లోపం ఏమిటంటే, గోమఠం శ్రీనివాసాచార్యులు రాసిన రెండు మూడు గేయాలను అప్పారావుకు అంటగట్టి, ముత్యాల సరాలతో కలిపి అచ్చు వెయ్యడమే అయితే, ఈ ప్రతిలో "ముత్యాల సరములు" అనే అప్పారావు వ్యాసం చేర్చి కవి హృదయాన్ని పాఠకులకు అందించడానికి ప్రయత్నించడం మంచిదైంది నేనూ ఆ పద్ధతినే అవలంబిస్తున్నాను పైగా, అప్పారావు గేయాలు గ్రంథరూపంలో అచ్చు కానప్పుడే వాటిని పరిశీలించిన ఆంగ్ల భాషా పండితుపైన పి శేషాద్రి వ్యాసాన్ని కూడా ఇందులో చేరుస్తున్నాను

'నీలగిరి పాటలు'కు సంబంధించి ఒక మాట చెప్పాలి చింతలూరి గణేశ్వరరావు, పిల్లుట్ల వి సుబ్బారాజు అనే ఆనాటి విజయనగరపు సంగీత విద్వాంసు లిద్దరు ఈ పాటలకు స్వరకల్పన చేసినట్లు తెలు

స్తున్నది. అది ఎంతమేరకు శాస్త్రబద్ధం అనే విషయం నాకు తెలియదు వావిళ్ళవారి ప్రతిలో ఉన్న పాఠాన్ని ఉన్నది ఉన్నట్టుగా ఈ ఎడిషన్‌లో ఉంచుతున్నాను కాకుంటే, పాఠకుల సౌకర్యం కోసమని ఒక మార్పు చెయ్యవలసివచ్చింది ఏ పాట ఆంగ్లానువాదం, స్వరం, ఆ పాట వెనకనే ఇచ్చాను

విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రతిలోనూ రామానుజాచార్య విద్యాసమితి ప్రతిలోనూ లేని గేయాలు రెండు, గురజాడ రామదాసు గారి ప్రతిలో కనిపిస్తాయి వాటిని ఈ పుస్తకంలో చేర్చాను అలాగే 'పుష్పలావికలు', 'మాటల మబ్బులు', 'మెరుపులు', 'ఋతశతకము' వంటి పద్య రచనలను విడిచివెయ్యవలసివచ్చింది దీనికి ముఖ్యమైన కారణం, 'సుభద్ర'లో కనిపించేంతటి పద్యరచనా పటుత్వమైనా వీటిలో లేదు పైగా యతిభంగాలు, శబ్దదోషాలు వగైరా కొల్లలు ఇవన్నీ తానూ పద్యం రాయగలనని అనిపించుకోడానికే పనికివస్తాయి బాగా రాయగలనని అనిపించుకోడానికి మాత్రం పనికిరావు. 'సుభద్ర' అలా కాదు పట్టుపట్టి రాపింది కాబట్టి దీన్ని మాత్రం ఉంచి, తతిమా వాటిని మినహాయించడం జరిగింది రచనా కాలాన్నిబట్టి ఈ విషయక్రమాన్ని నిర్ణయించాను ఈ మాత్రం స్వాతంత్ర్యాన్ని ఎవరూ అపార్థం చేసుకోగూడదని మనవి చేసుకోరని నమ్మకం

జవహర్ భారతి<br>
కావలి

కె వి రమణారెడ్డి<br>
20-12-71

# ముత్యాల సరములు*

ఆగష్టునెల 17వ తేదీని (1910?) వెలువడిన ఆంధ్రపత్రికలో ఒక శతావధానిగారు నేరాపిన ముత్యాల సరము అను పద్యముల విమర్శించిరి ఆ పత్రిక నా కందినప్పుడు నేనా విమర్శనమును చూచి యుండలేదు. తరువాత కొందరు మిత్రులు చూపి నాతో చెప్పిరి ఇంతట్లో మావూరి 'భారతమాత' శతావధానిగారి వ్రాతను గర్హించుతూ వ్రాసినది పిమ్మట శతావధానిగారి విమర్శనమును కూడ నేను చదివితిని.

విమర్శనము రాసినందుకు శతావధానిగారికి నేను కృతజ్ఞుడను. చర్చ జరిగినగాని నిజము వెల్లడి కానేరదు నా ఉద్యమమువల్ల ఆంధ్ర భాషకు ముప్పువచ్చునను భయము వారికి పొడమి వారు కొంచము కఠినముగా రాసియుందురు తప్పేమి? ఆంధ్రభాషయందు వారికి మిక్కిలి యభిమానముండుటనే కదా వారి మనసునకు వ్యథకలిగి ఆ రీతిని వ్రాసియుండిరి? స్వమతాభిమానమును, పరమత నిరసనమును అందరికి సహజమే కదా?

'భారతమాత' శతావధానిగారిని గురించి కొంచెము కఠినముగా వ్రాసినందుకు నేను యెంతో విచారిస్తున్నాను లోకోపకారము లయిన గొప్ప సంగతులు చర్చించు చున్నప్పుడు మనసులు నొచ్చునట్లు రాసి, ఆగ్రహమునకు అవకాశము కలుగ చెయ్యరాదని నా అభిప్రాయము, శతావధానులు పండితులు, పూజ్యులు. వారివల్ల నాలుగు తిన్ననూ, చేతనైన యెడల వారిని ఒప్పించడముగాని, తెలియని చోట వారివల్ల తెలిసికోవడముగాని లాభకరము దూషణమువల్ల లాభములేదు

సులభమైన కొత్త గ్రాంథిక భాషను కల్పించుకొనడమును గురించి నా అభిప్రాయములను తెలియజేయవలెనన్నచో, పెద్ద గ్రంథము

---

* ఈ వ్యాసం తొలూకు ముద్రితి పాఠమును అవసర మయిన ఒకటి రెండు మార్పు చేర్పులతో చేర్చడమైంది.

రాయవలసి వస్తుంది. ఆ విషయము చర్చించుటకు నాకు యిప్పుడు అవకాశము చాలదు శతావధానిగారు యింగ్లీషు నేర్చినవారివలె కనపడుతున్నారు వారు సంస్కృత, ద్రావిడ భాషల వ్యాకరణములేగాక, యింగ్లీషున వ్రాయబడిన భాషాశాస్త్ర, భాషా చరిత్రములను కూడా చదివియున్న యెడల, వారిని అందలి సంగతులు జ్ఞాపకము తెచ్చుకొండని ప్రార్థించుట తప్ప నేను చేయవలసినపని వుండబోదు

## కా వ్య గు ణ ము లు

శతావధానులుగారు నా పద్యములందు మూడు పెద్ద తప్పులు పట్టినట్లు కనపడుచున్నది ఒకటి—నేను గ్రాంథిక భాషా వాక్యరణమును పాటించలేదని, రెండు - ఛందశ్శాస్త్రమును పాటించలేదని, మూడు - పద్యములలో కావ్య గుణములు లేవని

కావ్య గుణములు ఒకరి సొమ్ముకావు లక్షణ గ్రంధము లెంత చదివినను, అందలి అలంకారాదులు తమ కబ్బమునం దెంత యెక్కించవలెనని ప్రయత్నించినను చాలమంది పండితులు మనసును రంజించు కావ్యములు వ్రాయలేదు అది వారి పాండిత్యమున కొక లోపముగా తలచకూడదు కావ్యగుణములు ముఖ్యముగా ప్రతిభవల్లను, కొంతవరకు కావ్యజ్ఞాన కళాజ్ఞానము వలననూ, పూర్వకవుల కావ్యరసము మనసును పట్టి ప్రవర్తింపజేయుటవల్లను కలుగును. అది అలా వుండగా గుణగ్రహణముకూడ కొంతవరకు అలవాటును పట్టేవుండును. ఇంగ్లీషు సంగీతము సహించని హిందువులును, హిందూ సంగీతము సహించని ఇంగ్లీషువారును యెందరో కలరు ఒకవేళ మన లక్షణ గ్రంథములనే తీసి, యీ యీ గుణములు యీ యీ పట్ల పట్టినవని యెత్తి చూపినను శతావధానులుగారు అంగీకరింతురని నేతలచను ఇక మన లక్షణ గ్రంథములలో కానరాని కావ్య గుణముల మాటో, లక్షణ గ్రంథములలో చెప్పడమునకు శక్యము కాని కావ్యగుణముల మాటో, చెప్పనేల? గ్రాంధిక భాషా వ్యాకరణమును అనుసరించని తెలుగు వ్రాతలు శతావధానులుగారికి

అసహ్యములై యుండును ఇందున గురించి అట్టే చర్చించిన విని యోగము వుండదు

ముత్యాల సరముల మాట అటు వుండ నియ్యండి. 'ఆంధ్ర భారతి'యందు ప్రచురించిన వ్యాసములలో రెండు మూడు దక్కా తక్కిన వన్నియు తమ స్తుతి తామే యొనరించవలెనట బుద్ధి శాలులును, గద్య ప్రబంధ రచనా చణులును అగు 'ఆంధ్ర భారతీ' విలేఖకుల వ్రాతలు శతావధానిగారికి మనస్కరించక పోవుటకు కారణము ఊహింపజాలను

## ఛ ం ద శ్శా స్త్ర ము

శతావధానులుగారు ఛందశ్శాస్త్ర సంస్కారము నెత్తిరి అట్టి సంస్కారముకు నే చూపినది దారి కాదనిరి "ఛందశ్శాస్త్ర సంస్కారము" శతావధానులుగారికి అభిమతమైనట్లే కానవచ్చుచున్నది ఛందశ్శాస్త్రమనగా తెనుగున లాక్షణికులు చేసిన నియమములని వారి యభిప్రాయము కావచ్చును లేకున్న శాస్త్రమునకు సంస్కారమన్న మాటీవరకు వినియుండలేదు

శతావధానులు గారిని నే నొక ప్రశ్న మడిగెద పూర్వులు చేసిన ఛందోనియమములు మార్చతగియున్నప్పుడు ఆంధ్ర వైయాకరణుల శాసనము లేల మార్చరాదు?

"తెనుగు భాషకు అనుగుణమైన వృత్తముల నన్నిటినీ, ప్రాచీన కవు లెరిగి నిరూపించిరి ఇక మనస్వేచ్ఛా ప్రచారమునకు అవకాశము లేదు" అనేయడల కథముగిపినది యూరోపియన్ భాషలలో కవులు కొత్త వృత్తములను కల్పించి భాషాభివృద్ధి చేయలేదో? కొత్త వృత్తములను కల్పించ వచ్చునన్నచో, నా నేర్పుకొలది నేనొక కొత్త త్రోవ త్రొక్కితిని తప్పేమి? నలుగురూ ఆమోదించిరా, నేను కల్పించిన వృత్తమును అవలంబింతురు ఆమోదించరా, పరిత్యజింతురు గాని దానిని గర్హించుటలో అక్షరవిన్యాస మెచ్చపెచట పెటుకుగా నున్నదో, విరామము లెచపెచట శ్రావ్యతను చెరచెనో శతావధానిగారు శలవియ్యరైరి.

## ముత్యాల సరముల లక్షణము

ముత్యాలసరములలో నే చేసుకున్న నియమ మిది మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పదునాలుగేసి మాత్ర లుండును నాలుగవ చరణమున యేడు మొదలు పదునాలుగువరకూ వుండును విరామము అర్థానుసారముగా చెవికింపగునట్లు మార్చ యత్నించితిని ఇంతవరకు నాయుద్యమము కొనసాగెనో లేదో, మార్పులయెడల నసహనములేని చదువరులు చెప్పవలె

ఇక యతిప్రాసల మాట నేను అజ్ఞుడనే కావచ్చును గాని, తెనుగు లాక్షణికులు యతిప్రాసములని చేసుకున్న సంకేతములు బడి కుఱ్ఱవాళ్ళకును తెలిపియుండునుగదా నాకు తెలియకనే అవి పద్యము లందు అమరినవని శతావధానిగారు యెట్లు తలచిరి? తెనుగు నాకు మాతృ భాష అవుటను యతిప్రాసములు దొరలినవట తెనుగు భాషకును, యతిప్రాసములకును నైసర్గిక సంబంధ మెట్టిదో శతావధానులు సెల విత్తురుగాక!

పాత ఇంగ్లీషులో మన యతి నియమమువంటి నియమ ముండెను వర్డ్‌స్‌వర్తు మొదలైన మహాకవులు అంత్య నియమమును విడనాడి ఉత్కృష్టకావ్యములు వ్రాపిరి అప్పుడు మార్పులు సహింప జాలని విమర్శకులు గొల్లుపెట్టిరి ఇంగ్లీషుభాషకు యతి నైసర్గిక మైనట్టా? అంత్య నియమమయినట్టా? రెండూ కానట్టా?

తెనుగును, కన్నడమును అక్కచెల్లెళ్ళు కన్నడ భాషలో యతినియమముతేదే! యేమి సాధనము? తెనుగులో కొన్ని జాతులకు, వృత్తములకు ప్రాస నియమము లేదు దీని కేమి సాధనము?

ఆర్యభాషలు మారి పుట్టిన ప్రాకృతాది భాషలలో అంత్య నియ మము ప్రబలినది సంస్కృతమునకే స్వాభావికముగాని యీ అంత్య నియమము వీటి కెలాగు స్వాభావికమాయెను?

తెనుగున మనము యతిప్రాసము లనువాటిని, సంస్కృతకవు లచ్చటచ్చట నలంకారములుగా తగిలించుచు వచ్చిరి చేతగాకనా, లేక

సంస్కృతభాష యీ యతిప్రాసములకు వొదగకనా, వారు నియమ ములుగా నుంచుకొనరైరి?

బంగాళీలలో మొన్నటివరకూ అంత్య నియమ ముండెను మైఖేల్ మధుసూదనదత్తు అను నతడు అంత్య నియమమును విడిచి, ఒక మహాకావ్యమును వ్రాపి, బంగాళీ కవులలో అగ్రగణ్యుడాయెను

నేను యెరిగియె యతిప్రాసలను అలంకారములుగా ముత్యాల సరములలో ప్రయోగించితిని నియమముగా నుంచినయెడల, యతి ప్రాసములకుగాను తెచ్చిపెట్టుకున్న శబ్దములు అర్థపటుత్వమును చెరచి, సందర్భమును తప్పించి, యీడ్చుకుపోవును అందుకు శతావధానిగారు యెత్తిన ముతక సామెతయే ప్రమాణము

## పార్షీ గ జ లు

ఒకజాతి పార్షీగజలు యొక్క నడక ముత్యాల సరములలో తెచ్చుటకు నే యత్నించి యుంటిని నేను కలముకు వచ్చినట్లు వ్రాసితినని శతావధానులుగారు అభిప్రాయపడిరి అది నిజము కాదు కలమునకు వచ్చినట్లు రాయుట శతావధానిగారికి అలవాటయి యుండును లేనియెడల శతావధానమెట్లు చేయగల్గుదురు? ఏకైకదిన ప్రబంధఘటికా సద్యశ్శత గ్రంధకల్పన కొందరిమతమున కవితమేరకు ఇతరులు అర్థపటుత్వ శబ్దౌచిత్యములను సాధించుటకు మిక్కిలి శ్రమ చేతురు చిత్రము వ్రాయునప్పుడూ, జిలుగు చెక్కునప్పుడూ శిల్పి యెట్టి పరిశ్రమచేయునో అట్టి పరిశ్రమము చేసినగాని కావ్యగుణము లబ్బనేరవని మామతము

## మాతృభాషా ప్రభావము

గ్రాంధికభాషా సంస్కరణమును గురించి నా అభిప్రాయముల నిక్కడ రాయజాలనంటిని. ఒకటి రెండు మాటలు మాత్రము రాయక వుండబట్టక రాస్తున్నాను.

శతావధానులుగారు వక్కతప్పైనా లేకుండా సంస్కృతము రాయగలిగియుందురు తెనుగు మాత్రము నిర్దుష్టముగా రాయజాలరు లక్షణగ్రంథములనూ, ప్రాచీన కావ్యములనూ అనుసరించి గ్రాంథిక భాషనే రాతామని వారు యెంత ప్రయత్నించిననూ మాతృభాషా ప్రభావమువల్ల వాడుకభాషలోని ప్రయోగములు తెలిసో, తెలియకో పంక్తులలో వచ్చి కూర్చుంటవి

1 లేఖరుఱు, 2 ఎక్కడ యాగినదో, 3 రెండు మాటలు దక్క తెనుగున, 4 వరకు చదివిన, 5 ఉండవలయును కాని, 6. సిరాయును కాగితము- ఇట్టివి యిందు పెక్కులు గానబడుచున్నవి అవి శతావధానులుగారు వ్రాసిరి "సీసపద్య అర్థము యను శీర్షికతో" నని రట అకారమునకు యకారము అచ్చు తప్పు యెట్లగును? ఇక శతావధానిగారి రాతలలోనూ, మిత్రులు యం వి కృష్ణారావుగారి రాతలలోనూ విసంధులు కానవచ్చు చున్నవి యే ఆంధ్ర శబ్దానుశాసనమో అందులకు ప్రమాణము? బహుశః కౌస్తుభకారుడు ప్రాచీనుల మతమని ఉదాహరించిన "సంహితైక పదే నిత్యా" ఇత్యాది కారికలను వారు చూపగలరు. అది కుదరదు

నా రాతలవలన ఆంధ్రభాషకు ముప్పెట్లు వచ్చును? ప్రాచీన గ్రాంధిక భాష గ్రంధములలో నున్నది ఇంగ్లీషువారి పుణ్యమా యని, యెక్కడి మారుమూల గ్రంథములూ చాపు దప్పి అచ్చు పడ్డవి వాటి నన్నిటినీ ఒక్క పెట్టున పరశురామప్రీతి చేయుటకు గవర్నమెంటువారు చట్టము నేర్పరచినగాని, ప్రాచీన గ్రాంథికభాష నిరర్గళముగా తూగిన వారు ఆ భాషనే వ్రాసి ఆనందింతురుగాక, ఎవరు వొద్దనిరి? వారివంటి పండితులు వ్రాయనూ వచ్చును! వెతకి తప్పులబట్టి ఒకరి నొకరు దూషించుకొను వ్యాపారమును కల్పించుకోనూ వచ్చును. ఎవరు వద్దనిరి? చిత్రము! నా రాతలవల్ల "త్రిలింగ" భాషకు ముప్పు వచ్చెనని శతావధానులుగారు విలపించుచుండగా, ఆ పేజీలోనే వేంకటరాయ శాస్త్రిగారు శతావధానులుగారి రాతలవల్ల "ఆంధ్రభాషా యోషామణి

కెన్నిపాట్లు వచ్చుచున్నవి" అని వ్రాసిరి భాషకు ముప్పు వచ్చునో లేదో కాని యీ దొమ్ములాటవల్ల పత్రికలు చదువువారికి తప్పక ముప్పు వచ్చుచున్నది

కవిత్రయమువారి గద్యములను, అవధానిగారు వ్రాసిన విమర్శ గద్యమును పాక్షిక దృష్టి విడిచి శతావధానులుగారు తైపారు వేసి చూచినచో శబ్దముల యందును, రూపముల యందును, అన్వయ పక్కియందును, వారి తోవను తప్పి వీరెంత దవ్వు నడిచిరో శతావ ధానులే తెలియగలరు. ఇంత మార్పును తెచ్చిన శతావధానులే భాషా సంస్కరణ ధురీణులుగాక ఒరు లెట్లు కాగలరు? వారితోవనే కదా మా బోట్లము పోవుట? "మహాజనో యేవ గత స్సపంథాః"

## వాడుక బాష

ఆంధ్ర గీర్వాణ సాహిత్యములు కలిగి తెనుగు వ్రాయువారు మిక్కిలి అరుదు దేశములో నూరు మంది వుండరని నిశ్చయముగా చెప్పగలను మాట (వరస)కు నూరంటిని అంతకు చాలా తక్కువే సంస్కృత సాహిత్యము లేనివారు కోటానకోట్లు పత్రికలలోను, నవీన నాటకాది గ్రంధములలోనూ వారి లక్షణ స్ఖాలిత్యములు యెన్న వశమా? అట్టి తప్పుల తడకలను వ్రాసి, అవ్రాతను గ్రాంధిక భాష అనుకొనుట కన్న ఇప్పటి నాగరికులును, శిష్టులును వ్యవహరించు భాషనే రాసుకొన రాదా? ప్రౌఢ గద్య కావ్యములనూ, పద్య కావ్యములనూ వ్రాయు వారు, గ్రాంధిక భాషలోని యింపగు పదములను తీసికొందురు గాక. సులభసాధ్యమగు నవీన గ్రాంధిక భాషొకటి ప్రబలిన యెడల, బుద్ధి బలము కలిగియు, మూగలై యున్న మన వా రెందరు గ్రంధములను వ్రాసి భాషను వృద్ధి చేయుదురు! పుట్టుకవులయి, కఠినమగు గ్రాంథిక భాష నేరని వారి కది మహోపకారము కదా?

వాడుక భాష కావ్యరచనకు తగదని శతావధానుల యభిప్రా

యము తగునని నా యభిప్రాయము వాడుక భాషలే కదా కవులు రాయ రాయ గ్రాంధిక భాషలైనవి? ఈ భారత వర్షములోనూ, యితర దేశ ములలోనూ వాడుక భాషలలో రసవంతమైన కావ్యములు పుట్టియుండ లేదా? బర్న్సు అను మహాకవి మాట శతావధానులుగారు వినలేదో? వారికి రుచించనిచో వాడుక భాషలోని కావ్యాలు శతావధానులుగారు చదువ కుందురుగాక- గాని "ఇట్టి వ్రాత లిక బయలు దేరనీకు"డని వ్యాకరణ వేత్తల వేడుట వ్యర్థము కదా? వ్యాకరణ మనగా శబ్దాను శాసన సూత్రములు, కేతన ఆంధ్ర భాషా భూషణము, అధర్వణ కారి కలే గద? యేమి పొందికైన వ్యాకరణములు! శతావధానిగారు వాటి నెంత మన్నించి వ్రాసిరి?

నేను చేసిన ప్రయోగములను కొన్నిటిని వా రాక్షేపించిరి రేఫ యుక్తమైన అక్షరముండ దని యంటిరి। రేఫతో కూడుకున్న కొన్ని గ్రాంధిక భాషలోని మాటలు చెవి కింపుగా నుండవు అవి రేఫలేక వాడుక భాషలో కనపడి పలుకుటకు సుకరముగాను, శ్రావ్యముగానూ వుండును 'క్రొత్త'యని వ్రాయక పోవడమునకు కారణము అది పెటుకని నాకు తోచుటయే అది ముద్దులు మూట కట్టినట్టు వున్నదని శతావధానులుగారికి తోచిన యెడల దానిని వారు తనివి తీర పలుకు చుందురుగాక "వ్రాత" వాడుకనో లిప్యర్థముతో లేదు "రాత" కద్దు అది శతావధానులుగారు వాడరు కాబోలు "డెబ్బై" యీ పట్టిను వాడుదురు డెబ్బది కన్న డబ్బది మృదు వని నా యభిప్రాయము. తెనుగు శబ్దములకు యెక్కడనోగాని "వ" కారము ఆదియం దుండ దని వ్రాసిరి "వొ" కారమునకు "వ" కారము అచ్చు తప్పై ఎ యుండును గ్రాంధిక భాషలో "ఉ" కార "ఓ" కారాదులైన శబ్ద ములు "వు" కార "వో" కారములతో వాడుక బాషలో కనబడును

తిట్ల కెవరు వెరతురు? వాడుక భాష జీవిక కలది దాని ప్రవా చారము మహానదీ ప్రవాహము వంటిది. ఎవ రడ్డ గలరు? శతావధానులు గారు వారికి "తెలియకుండగనే" వ్యావహారిక భాషా మహత్వం కారణ ముగా చేయుచున్న "వ్యాకరణసూత్రముల నిష్టము వచ్చినట్లు త్రెంచడ" మనెడి మహోద్యమమును తెలిసి, ఆంధ్ర భాషను పెంపు చేతురుగాక

ఇట్లు పండిత విధేయుడు

విజయనగరం

గు అప్పారావు

# NEW CURRENTS IN TELUGU SONG

"Certainly, I must confess my own barbarousness, I never heard the old song of Percy and Douglas that I found not my heart moved more than with a trumpet" It was with a keen recollection of this famous sentence of Sir Philip Sidney's that the present writer pored over a simple and unpretentious ballad, which reached him by accident an unbearable summer noon last year A few pink sheets, folded carelessly into a thin and sallow packet, were placed into his hands to while away a tedious hour. The pages were turned with a feeling of listless languor, there was nothing within sight, but blinding rays of the sun, there was not the remotest chance of the mind being refreshed in such surroundings, and lo! to his intense astonishment there was unfolded before his eyes a Telugu ballad whose moving pathos went straight to the heart It was a gloomy tragedy, enacted in its essence in many a Hindu home, proclaiming in mourning notes the baneful consequences of some of our social institutions There grew a beautiful maiden in a sweet mountain valley, a greedy father gave her in marriage to a dotard for material considerations, and she disappeared one evening amidst the lotuses of the adjoining tank preferring death to such conjugal unhappiness Here was a theme full of pity and sorrow and it was worked to such a pitch of suffering and softened with such tenderness that it was difficult to restrain one's tears Here was intrinsic merit enough to justify further interest and enquiry, and there was the additional circumstance that it was mainly in directions somewhat alien to the history of

Telugu literature Telugu poetry was being enriched by new currents of feeling and workmanship as the result of its contact with the rich treasures of English literature And none interested in the subject of Telugu literature or in the influence of English on Indian vernaculars could afford to ignore such striking tendencies, especially at a time distinguished by a widely felt desire for the improvement of those languages. The ballad was from the pen of Mr G V Appa Rao, of Vizianagaram, a Telugu scholar and poet of considerable ability, and repute, who had long been endeavouring successfully to introduce new impulses into Telugu literature

A review of some of his recent productions in verse must thus be of considerable value for a study of some of the possible developments of Telugu poetry in the future, and more generally as affording an instance of literary evolution, in obedience to external impulses of a powerful and desirable type In a country in which progress is retarded at every step by the purblind champions of conservatism, it becomes almost a duty to welcome such well-meaning reformers Profiting by the literary models of an alien tongue other than Sanskrit is unfortunately an unfamiliar process to every one of the numerous vernaculars of the land, and the first appreciable innovations are to be traced in movements of this nature which have come into existence only within the last few decades

It is idle to deny the existence of ballads in this land Many a wandering minstrel may be seen singing the deeds of old chieftains to groups of assembled villagers under the spacious shade of the banyan But we believe the ballad form has been used with un-

doubted literary value about it for the first time in Telugu literature by the poet here When Bishop Percy ventured to publish the "Reliques of Ancient Poetry", he thought it necessary to put in an apology in the preface for having concerned himself with what may be called 'vulgar' literature. It is significant that nobody should have had the courage to do so for Telugu ballad literature, even with the expression of some scepticism as to the wisdom of such a procedure

A cursory examination of the ballad referred to already is sure to reveal its striking literary merits. The poem seems to open with a sudden outburst of tinkling silver bells arresting our attention, attuning us to a sympathetic enjoyment of what is to follow Though the poem represents a reformed type in literature, there is a rare and loving insight into the pious Hindu rites in which the youthful heroine finds consolation There is a true knowledge of the playful ways of childhood displayed in the explanation of the main cause of her misery after marriage It was the ridicule of her playmates, who scorned the lass that married a "grandfather", that she could not bear Her parting words—she was thought to be changing her home, but she was really flying to the arms of Death—are a study by themselves in the delineation of the true ideal of sacrifice and spotless love that ought to actuate an ideal woman They are characteristic of a true Hindu heroine! "Brothers, let service to our dear father and mother be your constant care, do not swerve from your faithful worship of our family goddess, the Mother of all Mothers, offer at her feet the best flowers and fruits of the season; when the members of our family come together in joy, let there be a thought for one who is not with them" - - and the most tender

touch of all, - - - "confer my name as a token of memory on one of your children " As she disappears, we feel a true heroine has vanished from the stage, leaving the wicked world in darkness, for the absence of such a light It is a tragedy that must come home to every Hindu heart and cry for immediate redress It is an artistic impulse that has been responsible for the productiou, but it will not certainly be maintained that its value is lessened, by its capacity for rousing attention to a great social peril that is responsible for not a little of the unhappiness around us

Numerous social principles, full of the liberal impulses of today, are skilfully woven into the poems of Mr Apparao without the least detriment to their artistic spirit Orthodox Hindu sentiment may stagger at some of the radical ideas embodied in his poems, but to the cultured mind they are significant of the new light that is illumining our social life enabling us to perceive the wrongs of centuries The popular Hindu ideal of the divinity of the husband, which, though capable of some moral influence, does not certainly tend to equality in love, is severely handled in the poem entitled ' Sovereigns" There is in the poems a rude shock to popular sentiments as in the plays of Ibsen and Bernard Shaw, but the effect must be equally wholesome "It is an old-world saying that the husband is a God", says the husband himself, "he is a comrade", and proceeds to offer his spouse not the jewels of gold which in a moment of feminine weakness she longs for, but the inestimable wealth of his love

The spirit of the social reformer is patent even in the poetic treatment of the philosophical allegory of King Lavana from the "Gnana Vasishta". It turns

on the kshatria ruler's love-experiences with a girl of the untouchable class It is terrible in its grim realism, and is as poignant in its emotional appeal as it is full of import to the social philosopher

From such heights of sublimity there is an occasional transition to the familiar scenes of home-life The poet sets out to string a few pearls together. The young Hindu husband has returned to the village from his stay in Madras, full of the new spirit, setting convention at defiance and drifting away gradually from the life of his people. There is a curtain-lecture , the wife administers a gentle rebuke there is an exposition of the conflict between the new and old, and at the threshold of great changes, the poet cannot help casting an anxious look at the departing world The youthful radical is warned against the possible disruption of home-life in his overzealous pursuit of reforms Is it not possible to look upon this as a declaration of caution by the poet himself ?

The version of the Greek tale of "Damon and Pythias" is a brilliant example of his ability in the easy and graceful narration of a story Out of the very scanty material afforded by classical literature, he has evolved a poem full of picturesqueness and animation The Greek setting is described with extraordinary vividness, with a very fine sense of sound and colour. The island of Samos is there before us in all the glory of spring. Each stanza is a complete picture in itself reminding one of some of the perfect landscape-paintings of Tennyson in poems like the "Palace of Art" It is a similar love of nature that is perceived in the "Songs from the Blue Hills", a miscellaneous collection of poems dealing

mainly with life and scenery on the Blue Hills, in "the sweet half-English Nilgiry-air" A piece of striking merit is one containing a declaration of love at first sight The beauty of repose which, according to Lessing, is the special province of painting and sculpture is curiously enough brought out here in poetry, in describing the charms of the person to whom the lines are addressed As they are read, there is a profound realisation, by the reader, of the truth uttered by the Greek Simonides, that poetry is eloquent painting

Numerous other pieces of merit are found among the poet's writings—the Telugu world will propably soon have the privilege of reading them in a collected edition It must be a task of no ordinary interest to examine them in detail and appreciate the variety of new elements that have been introduced into Telugu song But enough has already been said to draw attention to the success that has been achieved In those new lines of poetical activity. It is only necessary to add in conclusion that there is in the poems an absolute disregard of rhetorical artificiality and poetic convention, which have always been the bane of Indian literature And who will be so rash as to forecast the scope and significance of this movement which has the genuine ring of poetry and applies itself to the treatment of the primary emotions of humanity in a commendable spirit of high seriousness?

Ootacamund, P Seshadri
11th June, 1918.

(From the Educational Review, Madras, July, 1918.)

# SONGS
# OF
# THE BLUE HILLS

Composed by the Command of Her Highness
the Maharaja Kumarika Sahib
Sri Appala Kondayamba of Vizianagaram
Maharani of Madhogadh
(Reva State)

---

*By*

G V APPA ROW, B A

---

MADRAS

Printed at G R C Press

---

1907

శ్రీ

# నీలగిరి పాటలు

శ్రీ శ్రీ శ్రీ హర్ హయినెస్
ది మహారాజకుమారికా సాహెబా
శ్రీ అప్పల కొండయాంబా
ఆప్ విజయనగరం

మహారాణి ఆఫ్ మాఘోగడ్ (రీవాస్టేట్) వారి యనుజ్ఞను

## గురజాడ అప్పారావుచే

రచింపబడినవి

చెన్నపట్టం
జి రామస్వామి శెట్టిగారి
ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె

1907

To

The Loved Memory

of

Prince Charming

I dedicate these verses

## సుందరతర మీ నీలనగము

పల్లవి

సుందరతర మీ నీలనగము దీని
యందము హృదయానందకరము దీని
చందము హృదయానందకరము.

అనుపల్లవి

నందనవన మిదె - నాతిరో వింటివె
బృందారకముని - బృంద సేవితము

చరణములు

1. ఎచ్చటఁ జూచినఁ - బచ్చికపట్టులు
పొదపొద రొదలిడు - పొలుపగు పిట్టలు
వింతవాసనలు - వీచెడు చెట్టులు
కుదురు రిధ్యగల - కొలకుల గట్టులు

2 నిచ్చలు నగముల - నీటగు తోఁటల
విచ్చలవిడి చను - నచ్చపు మొగుళుల
నచ్చెరఁ గేరెడు - మచ్చెకంటు లిట
మించుతీవలన - మించి చరింతురు

3 పాదఘట్టనకుఁ - బర్వు చక్రములు
మంత్ర మహిమనగు - జంత్రపురథములు
పందెము వారెడు - పటు జవనాశ్వము
లందముగా నిట - గ్రందయి తోచును

4 గట్టుల లోయలఁ - గాజు చప్పరల
మట్టిగోలెముల - మడుపుల నడవుల
నెల్లెడ విరియగ - వెల్లువలై విరు
లిక్షు ధ్వను నౌన - లక్షయమయ్యెను

5 తప్పక భృత్యుల - నెప్పుడు బ్రోచెడి
యప్పల కొండయ - మాంబాదేవిని
నొప్పుగఁ బ్రోచుత - నప్పురదమనుడు
మెప్పగు వరముల - విప్పుగఁ గురియుచు

## *Beautiful Are the Blue Hills*

**Chorus** Beautiful are the Blue Hills, and their beauty gladdens the heart Verily this is the garden of the gods, and gods and sages love to roam here

Everywhere the eye meets expanses of green grass Birds sing sweetly from every bush The pine odours fill the air Lovely drives sweep round limpid lakes

In the masses of clouds that love to haunt the gardens on the hill slopes, fish eyed damsels flirt about like lightnings

Wheels that speed under tread, cars that mock the powers of magic, and swift horses that race move along in beauty

On ridges and in valleys, in lakes and in forests and in pots and in glass houses, flowers grow everywhere in profusion So the quivers of the god of love are inexhaustible here

May Siva, the Destroyer of the Puras, shower choice blessings on Appala Kondayamba Devi, who is kind to her servants

## రాగము, సురట - తాళము, ఆది

### పల్లవి

సానిధపమమగ। రిరి గరిరి సని స
నీ సరిరి మగరి రి పమగరిరి సా
నీ సరిరిమగరిరి పమగరిరి_సా

### అనుపల్లవి

రిమపనిని సరిగారిసని సరి సా
సానిధపమగరి సరిమపని_సా

### చరణము

రిమమ మా గరి ప్ప మరీరిరి
రిమరిమ రిసని సరి మరిమపాప్ప ప
రిమప ని ని సరిగారి సనిసరి
సాసాని ధపమగరి సరి మపని_సా

# ఊఁటి చోద్య మేమి చెపుదు

పల్లవి

ఊఁటి చోద్య మేమి చెపుదు
సువిద వింటివే

అనుపల్లవి

సాటియేది యూటికెందు
స్వర్గమైన దీని క్రింము

చరణములు

1 వాటమైన తటములందు
దోటలెంతొ సొంపుమీరఁ
గూటములను సౌధరాజి
కుదిరి మెరయగా
మాటుమఱగి శివుని జటా
జూటమునను గంగపగిది
కోటహ్రదములందు జలము
కొమరి యమరియుండును ॥ఊ

2 పండువెన్నె లవటి పవలు
పావకుండు రాత్రులందు
దండనుండి యింటనింట
దయను బ్రోవఁగ
నెండదాడి కోడి సీతు
కొండవట్టెనేమొ యనఁగ

నిండుకొలువు హేమంత
ముండి యిచట వెలసెను. ॥ఊటి॥

వెన్నుని సిగ నమరియున్న
వేల్పుతరువు విరులమాట్కి [1]
సనసన్న వెండిమబ్బు
పఱియ అంటగా
మిన్నుబూయ [2] సంజకాఁడు
మేళవించు రంగు లనఁగ
వన్నెవన్నె పూలగములు
వనము గ్రమ్మి మెరయును ॥ఊటి॥

## *The Wonders of Ooty*

Chorus Listen, friend, how can I describe the wonders of Ooty?
Ooty has no equal,
Heaven itself is inferior

Beautiful gardens cover the gentle slopes of the hills, and palaces glitter on the peaks Like Ganga on Siva's head, a hundred lakes nestle in the valleys

Here sunshine is mellow as moonlight, and at night, the fire gods give comfort in every home Worsted by Summer on the plains, Winter has taken to these mountain fastnesses and holds sway here

Silver clouds rest on the peaks like Kalpa blossoms on the head of Krishna, and many-hued flowers spread over the hillsides and shine like colours mixed by Evening to paint the dome of heaven

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'మాడ్కి'

2 అందులోనే 'ఎన్నుబూయు'

**Come friends, our merit has attained fruition, and we are enabled to see the great Blue Hills by the kindness of the King's daughter, Appala Kondayamba**

రాగము, పంతువరాళి - తాళము, రూపకము

పల్లవి

సానిధ ధపమమగామ గరి సస సరిగారిగరిప

అనుపల్లవి

రిసగారిసనిధధనీససానిదపగరిగమాపధని_సా

చరణము

గామ పామగగమరీససగరిగగరిగమపాము
పధనిధ మగగాగరీస_ససరిగరిగ_మపగరిస
గమపధని పధనినిసగమ పధనిధానిని సస
సరిగరి గగరీసనినిధ_సని సనిధపమగ మపధని_సా

# ఉమాపతి యర్చన

పల్లవి

ఉదకమండలమున - నుమాపతి యర్చన
కోటిగుణితమై - కోరిక లీడేర్చును

అనుపల్లవి

వెల్లనౌమబ్బులు - విరిసి వెన్నెల గాయ
వెండికొండని సురలు - వేడ్కతో రాఁగ.

చరణములు

1 కర్పూర తరువులు - కంబములై తోప
మిన్ను పందిరిఁబోల - మించు దివ్వెలుగాఁ
బచ్చల హాసియించు - పచ్చికపై విరు
లచ్చర లిడు ముగ్గు - ఒప్పున వెలయఁగ.

2 దేవదారు తరులు - దివ్యగంధము లీన
యక్షగానము మీఱ - పక్షులు పలుక
రపిత మల్లదె శంఖ - రావమై చెలఁగఁగ
దీవలేమలు పూలు - తిరముగఁ గురియఁగ

3 ఆశ్రితవరదుఁ - డంబికారమణుఁడు
బాల చంద్రమౌళి - భక్తికి నెద మెచ్చి
రాజరాజపుత్రి - రాజ్ఞి నప్పలకొండ
యాంబఁ బ్రోచుగాత - నధిక సౌఖ్యము లిచ్చి

## *Worship the Lord of Uma*

Chorus Worship the Lord of Uma on the Blue Hills and you acquire merit a thousandfold

White clouds envelop the peaks and make moon-light—and gods take the Blue Hills for the silver mountains and crowd with enthusiasm

They witness Nature's worship of Siva there The tall eucalyptuses form columns and the sky the awning Lightning serves for lights and flower beds in the midst of green grass look like ornamentation of the floor by wood nymphs in coloured powders

The pines waft divine odours, and the birds sing as never nymphs sang The thunder serves as the music of the conch - shell and creeper damsels shed flowers

May the Lord of Ambika who wears the moon crescent as a crest-jewel save Maharani Appala Kondayamba, daughter of the great king, pleased with her devotion

రాగము, భైరవి - చాపు, మిశ్రజాతి

పల్లవి

దని సససనీధపా। పని ధాపమాగరీ
రినిధని సరీరిగమాపామగరీ

అనుపల్లవి

పమపాధనీ సరిసగారి సనీధప
పనిసరీని ధాపపధనిధపమగరిమాపధని

### చరణము

పధనిన్నిధనినిధ। నిపధనిధధమాపప
పపామగరిరిగసాగరిగమధాప
పమపాధనీసరిసగారి సనీధప
పనిసరీనిధాప పధనిధపమగరిమాపధనిసస

# నా టి మా ట

పల్లవి

నాటిమాట మఱచుట యే
నాటికైన మఱవ వశమ

అనుపల్లవి

కోటి ప్రాణమీవంటి ము
మ్మాటికి నిను విడనంటి

చరణములు

1 మాట మూట గట్టికొని
పాటి దప్పి తనుట నా పొర
పాటుగాక, మాటన నే
పాటిర నీసాటి దొరకు

2 బ్రతుకునందు లేని స్థిరత
వెతకనేల భాషయందు
నతుకు వేషభాష కోడు
నతివలదే తప్పుగాక

3 సాటిలేదు నాకంటి వా
మాట నిజము నేడుగంటి
సాటికలదె నమ్మి భంగ
పాటుపడిన పడతి కెందు.

4 మేటివైన నీయెద మొగ
మాట మెటులఁ బాసె, నొక్క-
మాటురా, నీ యోటు మాటె
కోటి ధనము లిచ్చి కొందు

## *That Word of Long Ago*

Chorus Can I forget your forgetting that word of long ago?
You said I was your life
You promised never to part.

To treasure a word and to task you with unfaith is my fault Of what count is a word to a great one like you?

Women are to blame who turn thrall to words and ways that are not of the man

You said I had no equal I now realise the truth of it Where will one find another woman like me who trusted and suffered?

How has compassion left the breast of a great one like you? Come to me but once and I will buy even your false word for a crore of gold

రాగము, అఠాణ - తాళము, రూపకము

పల్లవి

గామపాపనిపనిపధా । నిసరిసనిసధాధ పమప

అనుపల్లవి

నిసగారిస _ సరిసనిధానిస
సనిసరిసరిసని పాపపానిధపమగిమ పాపగామప

## చరణము

పాపపాపగామపప_
ధాధధాధపధ నిధపగామస - నిసగారిస_
సరిసనిధానిస - సనిసరిసరిసనిపాప - పాని
ధపమగమపాప - గామప

# లేవొకో మంత్రములు

1 లేవొకో మంత్రములు - లేమగాఁజేయ నిను
లావపుడు బయలు బడునొక్కొ-
కావనుచు నీలాటి కాంతునకుఁ జిక్కి- నీ
భావముల నలయికను బడుదో

2 మంచియును చెడ్డయును మానమును గనక పటు
వంచనను పరకాంత దగిలి
యించుకయినను లోక మెంచునని భీతిలక
కొంచెతన మూను టది కొమరొ

3 మగఁడవై పగతీర్చ పగతుఁడవుగాక నిది
తగునటర తలపోయకుంట
మిగిలినది లేదు రిఁకమీఁద నిను నమ్మ నా
నగధరుని నమ్మెదను లేరా

## *Is There No Magic ?*

Is there no magic that will transform you into a woman? Would then your courage become plain? Would you, entangled in the wiles of a lord like you, suffer pangs of the heart?

Not to consider good and bad, and honour, and to take to another man's wife, not to heed the talk of the world, and to grow little—was that wise?

Are you a foeman of a previous birth born as husband to be revenged! Not too late I shall not trust you hereafter— I shall trust in God

## రాగము, శంకరాభరణము—తాళము, ఝంప

మగమ పాపాపపమగమ పమగామరి - గామపమ
మగ గరీగమపా మగ మపాధనిసాసనిసరిసధని
సని - పాధనీధపమగరిస

# చిత్తరువని చూడ

పల్లవి

చిత్తరువని చూడఁ జిత్తము గొంటివి
చిత్తజు నపరంజి చిలుక యెవ్వతెవే

అనుపల్లవి

వత్తువో నామ్రోల - వలరాజు వేఁడిన
మత్తకాశిని నీదు - మనమైన నీగదె

చరణములు

1 ఇచ్చి పుచ్చుకొంట - యిలలోని మర్యాద
ముచ్చిలి మౌనము - మెచ్చుదు రటవే
వచ్చి చూచినంత - వంచనఁ జేయుదె
పచ్చి దొంగతనము - పడఁతిరో పరువె.

2 మనసులేని తనువు - మరి యేలనే నాకు
చెనటి దీనిఁగూడ - చేకొనఁ దగవె
వానికి బదు లొక్క - వాక్కు నే వేఁడెద
మానిని యీపాటి - మన్నింపఁ జెల్లనె.

3 విలువ చాలదన్న - విరివిల్తుపై నాన
కలుగు జన్మములఁ - గానుక కొనవే
ఎలమి నానందేంద్రు - నేలిన వెన్నుఁడు
పలుతెలుఁగుల మేలు - పడతి నీ [illegible]

## *I Took You for A Picture*

**Chorus** I took you for a picture and looked You stole my heart Who may you be, O gold parrot of the god of love ?

If I pray to him, will he send you to me? Beautiful one, at least give me your heart

To give and take is the rule of the world Do the wise approve of stealth and silence ? Is one to be cheated for going and seeing ? Is open robbery a credit ?

What do I want with a body devoid of mind ? So take that also In return for both I crave but a word Oh, fair one, you may concede this much

If you think the price small, I present to you lives to come, and I call the god of love to witness May Vishnu who ruled the heart of Prince Anandaraja bless you !

రాగము, శంకరాభరణము—తాళము, మిశ్రజాతి చాపు

పల్లవి

పగామాపధపాప। మాధపమగ గమపగామ
రి _ మధపాపమగమరిసాసా సగాగామపరిస

అనుపల్లవి

పమగామాధానిస। నిసరిసనిధనిసా। పద
ధానిసానిధధని। సాసానిధపమధపామగరిస _ సా

## చరణము

మపామపమాగగమరి గగపామా
పమాధధ। గమధపమా గారిస। గ గామాపధ
పమగా మా ధానిస। నిసరీసనిధ నిసా। పధ
ధానిసానిధధని। సాసానిధపమధపామగ
రిస। సా

# ముత్యాల సరములు *
## (లేక) తోకచుక్క

గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల,
కొత్తపాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా

మెచ్చనంటా వీవు, నీ విక
మెచ్చుకుంటే మించిపోయను,
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా?

తూర్పు బలబల తెల్లవారెను,
తోకచుక్కయు వేగుచుక్కయు,
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్ను వీధిని

వెలుగునీటను గ్రుంకె చుక్కలు,
చదల చీకటి కదలబారెను,
యెక్కడనొ వొక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను.

మేలుకొలుపులు కోడి కూసెను,
విరులు కన్నులు విచ్చి చూసెను,

* 'ఆంధ్ర భారతి' పత్రికలో మొదట అచ్చుపడినప్పుడు (1910 జూలై) దీని శీర్షిక 'తోకచుక్క'

ఉండి, ఉడిగియు, ఆకు లాడగ,
కొసరెనోయన గాలి వీచెను

పట్ణమున పదినాళు లుంటిని
కార్యవశమున పోయి, యచ్చట
సంఘసంస్కరణ ప్రవీణుల
సంగతుల మెలగి,

యిల్లు జేరితి నాటివేకువ,
జేరి, ప్రేయసి నిదుర లేపితి,
"కంటివే?" నేనంటి, "మింటను
కాముబాణం బమరియున్నది"

తెలిపి, దిగ్గున లేచి, ప్రేయసి
నన్ను గానక, మిన్ను గానక,
కురులు సరులును కుదురుజేయుచు
ఓరమోమిడ, బల్కితిన్

"ధూమకేతువు కేతు వనియో
మోముచందురు డలిగి చూడడు?
కేతువా యది? వేల్పులలనల
కేలి వెలితొగ కాంచుమా!

"అరుదుగా మినువప్పరంబున
చొప్పు తెలియని వింత పొడమగ,
చన్నకాలపు చిన్న బుద్ధులు
బెదరి యెంచిరి కీడుగా

"అంతె కాని రవంతయైనను
వంత నేగతి కూర్చనేర్చనె,
నలువనేరిమి కంతు యిది యన
నింగి తొడవయి వ్రేలుచున్.

"కవుల కల్పన కలిమి నెన్నో
వన్నె చిన్నెలు గాంచు వస్తువు
లందు వెట్టి పురాణగాథలు
నమ్మజెల్లునె పండితుల్

"కన్ను కానని వస్తుతత్వము
కాంచ నేర్పరు లింగిరీజులు,
కల్లనొల్లరు, వారి విద్యల
కరచి సత్యము నరసితిన్

"దూరబంధువు యితడు భూమికి,
దారి బోవుచు చూడవచ్చెను-
డబ్బు దెనుబది యేండ్ల కొక తరి
నరుల కన్నులపండువై

"తెగులు కిరవని కతల పన్నుచు
దిగులు జెందు టదేటి కార్యము?
తలతు నే నిది సంఘసంస్కర
ణ ప్రయాణ పతాకగాన్

"చూడు మునుమును మేటివారల
మాట లనియెడి మంత్రమహిమను

జాతిబంధము లన్న గొలుసులు
జారి, సంపద లుబ్బెడున్.

“యెల్లలోకము వొక్కయిల్లై,
వర్ణభేదము లెల్ల కల్లై,
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ,

“మతము లన్నియు మాసిపోవును,
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును,
అంత స్వర్గ సుఖంబు లన్నవి
యవని విలసిల్లున్

“మొన్న పట్ణమునందు ప్రాజ్ఞులు
మొట్టమొదటిది మెట్టు యిది యని,
పెట్టినా రొక విందు, జాతుల
జేర్చి, వినవై తో?”

అంటి నే నిట్లంత ప్రియసఖి
యేమి పలకక యుండి యొకతరి,
పిదప కన్నుల నీరు కారుచు
పలికె నీ రీతిన్

“వింటి, మీ పోకిళ్లు వింటిని,
కంట నిద్దుర కానకుంటిని,
యీ చిన్న మనసును చిన్నబుచ్చుట
యెన్నికని యోచించిరో?

"తోటికోడలు దెప్పె, పోనీ,
సాటివా రోదార్చె, పోనీ,
మాటలాడక చూచి నవ్వెడి
మగువ కేమందున్

"తోడుదొంగని అత్తగారికి
తోచెనేమో యనుచు గుందితి,
కాలగతియని మామ లెంతో
కలగ, పిగ్గరినై

"చాలు నహా! మీ చాకచక్యము
చదువు కిదె కాబోలు ఫలితము,
ఇంత యగునని పెద్ద లెరిగిన
యింగిలిషులు చెపుదురా?

"కోటపేటల నేలగలరని
కోటి విద్యలు మీకు కరపిరి,
పొట్టకూటికి నేర్చు విద్యలు
పుట్టకీట్లు కదల్చెనా?

"కట్టుకున్నది యేమి కానీ,
పెట్టి పొయ్యక పోతె, పోనీ,
కాంచి పెంచిన తల్లిదండ్రుల
నైన కనవలదో?

"కలసి మెసగిన యంతమాత్రనె
కలుగబో దీ యైకమత్యము,

మాలమాదిగకన్నె నెవతెనో
మరులుకొనరాదో?"

అనుచు కోపము నాపజాలక
జీవితేశ్వరి సరుల నామై
చరచి చనె క్రొమ్మెరుగు చాడ్పున,
మనసు వికలముగాన్

తూర్పు బల్లున తెల్లవారెను,
తోకచుక్క యదృశ్యమాయెను,
లోకమందలి మంచి చెడ్డలు
లోకు లెరుగుదురా?

———

# దేశభక్తి *

దేశమును ప్రేమించు మన్నా
మంచి అన్నది పెంచు మన్నా!
వొట్టి మాటలు కట్టిపెట్టోయి
గట్టిమేల్ తలపెట్టవోయి!

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి!
తిండి కలిగెతె కండ కలదోయి
కండ కలవాడేను మనిషోయి!

యీసురో మని మనుషు లుంటే
దేశ మేగతి బాగుపడునోయి?
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయి!

అన్నిదేశాల్ క్రమ్మవలెనోయి,
దేశిసరుకుల నమ్మవలెనోయి!
డబ్బు తేలేనట్టి నరులకు
కీర్తి సంపద లబ్బవోయి!

వెనక చూపిన కార్య మేమోయి?
మంచి గతమున కొంచె మేనోయి!
మందగించక ముందు అడుగేయి
వెనకపడితే వెనకేనోయి!

---

* రచనా కాలం 1910

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థ కలహం పెంచబోకోయి
కత్తివైరం కాల్చవోయి!

దేశాభిమానం నాకు కద్దని
వొట్టి[1] గొప్పలు చెప్పుకోకోయి,
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయి!

ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చేసెనోయి,
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి!

పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి?
ఒకరిమేల్ తనమే లనెంచే
నేర్పరికి మేల్ కొల్లలోయి!

స్వంతలాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయి,
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి!

---

1 విశాలాంధ్ర ప్రచురణలో మాత్రం 'వట్టి' అని ఉంది

చెట్టపట్టాల్ పట్టుకుని
దేశస్థులంతా నడవవలెనోయి,
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయి!

మతం వేరై తేను యేమోయి?
మనసు నొకటై[1] మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయి!

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమ లను పూ లెత్తవలెనోయి,
నరుల చమటను[2] తడిపి మూలం
ధనం పంటలు పండవలెనోయి!

ఆకులందున అణగి మణగీ
కవిత కోవిల[3] పలకవలెనోయ్,
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయి!

---

1 విశాలాంధ్ర కొత్త పాఠం — 'వొకటై', పాత పాఠం — 'మనసు లొకటై'

2 విశాలాంధ్ర ప్రచురణలో 'చెమటను'.

3 విశాలాంధ్ర ప్రచురణలో మాత్రం 'కోయిల' అని పాఠం

# కాసులు*

మనల కీ పోరాట మిప్పుడు
దేని గూరిచి కలిగె చెపుమా,
మరచితిని, నవ్వేద వదేలను?
యేమి కారణమైన పోసీ,

వినుము, . ధనములు రెండు తెరగులు
ఒకటి మట్టిని పుట్టినది, వే
రొకటి హృత్కమలంపు సౌరభ,
మదియు నిది యొక్కడను కలుగుట
యరుదు, సతులకు వేడతగినది
యెద్దియో?

"మనసులో నీకుండు
ధనమన నొండు గలదే పసిడి
గా"కని ప్రాజ్ఞులకె కనికట్టు
కనకము, చపల చిత్తల కన్ను
చెదరుట చిత్రమా! తీవలకు
తలిరుల తెరంగున, కాంచనము
సింగార మందురు లలనలకు,
కానిమ్ము, గాని, కమ్మని తావి
గ్రమ్మెడి పుష్పనిచయము ప్రేమె
కా? అది లేక మంకెన కెంపు,
కాంతల యందము

ప్రేమ కొరుకుకు
తిందురా? యెట్టిదది? నావలను

---

* 'ఆంధ్ర భారతి'లో ఇది 1910 అగస్టులో అచ్చుపడింది

కలదో, లేదో, యను నొక వింత
చూపును చూచెదవు—

బంగరు
మిసిమిమేనికి పసపు నలదితి,
కురుల నలరుల నూనె నించితి,
కాటుకను మెరుగిడితి చూడ్కికి,
విడెము వింతహొరంగు గూర్చెను
వాతెరకు, పలువరుస వెన్నెల
లలమె, దానదానను, మురువు
పెనగొనె నేర్చి మెరపితి రూపు,

ప్రేమ పెంచక పెరుగునే?
ప్రేమ—
పెన్నిధిగాని, యింటను నేర్ప
రీ కళ, ఒజ్జ లెవ్వరు లేరు
శాస్త్రము లిందు గూరిచి తాల్చె
మౌనము—నేను నేర్చితి భాగ్య
వశమున, కవుల కృపగని, హృదయ
మెల్లను నించినాడను ప్రేమ
యను రతనాల—కొమ్మ!
తొడవులుగ నవి మేనదాల్చుట
యెటుల నంటివా? తాల్చి తదె, నా
కంట చూడుము! సతుల సౌరను
కమల వనముకు[1] సతుల ప్రేమంబె
వే వెలుగు, ప్రేమకలుగక బ్రతుకు
చీకటి

నా నేర్చుకొల దిది

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'వనమునకు'.

(ప్రేమ విద్దెకు వోనమా లివి.)
యెదను నిల్పిన మేలు చేకురు

మరులు ప్రేమని మది దలంచకు,
మరులు మరలును వయసుతోడనె,
మాయ, మర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజమార్గము
ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును,
ప్రేమ నిలిపిన, ప్రేమ నిలుచును
ఇంతియె

కాసు వీసము నివ్వనొల్లక
కవిత పన్నితి నని తలంపకు,
కాసు లివె, నీ కంఠ సీమను
జేరి బంగరు వన్నె గాంచుత!
మగడు వేల్పన పాతమా టది,
ప్రాణమిత్రుడ నీకు, నీ నెనరు
కలుగకయున్న, పేదను, కలిగినను
నా పదవి వేల్పులరేని కెక్కుడ?

---

అన్ని ముద్రణలలోను ఈ గేయ చరణాలు అర్థక్రమానికి తగినట్టు అచ్చుకాలేదు విరామ చిహ్నాలుకూడా సరిగా ఉండ లేదు ఆలోపాల నివారణకు కొంత స్వాతంత్ర్యం తీసుకొని అమర్చడం జరిగింది

# డామన్ పితియస్*

## 1

వన్నె కెక్కిరి డమను పితియసు
లన్న యవనులు ముజ్జగంబుల
మున్ను, వారల స్నేహసంపద
నెన్న సుకృతంబౌ

ఒక్కనా డా సీమ జనపతి
యక్కజంబగు కోపభరమున
"వ్రక్కలించుము డమను శిర"మని
పలికె తలవరితోన్

చెక్కుచెదరక నిలిచి డమనుడు
"నిక్కమే కద చావు నరునకు
యెక్క డెప్పుడు[1], యెటుల గూడిన
నొక్కచే కాదా?

"మ్రందు టన్నవి బొంది[2] మార్చుట
ముందు భవమున కలుగు విభవము
నందజేయుట కాదె, యేలిక!
దండమను మిషను?

"కాని యింటికిపోయి యొకతరి
కనుల జూచెద నాలుబిడ్డల

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'యెప్పు డెప్పుడు' 2 దానిలోనే 'బొందె' 'ఆంధ్రభారతి'లో ఇది 1910 సెప్టెంబరులో అచ్చుపడింది

పనులు తీర్చుకు మరలి వత్తును
　　యానతిం" డనియెన్.

వింత పలుకుకు విస్మితుండై
కొంత కరకరి తీరి నరపతి,
"యింత యిట్టుల మిడునె వి"ద్యను
　　చింత చిగురెత్తన్,

అనియె నరపతి "యటుల కాని
మ్మవని[1] కొంచము[2] విపుల మందురు,
తనువు దాచను తగిన చోటులు
　　కలవు యెటు జనినన్

"మించు చతురత మాట విరుపున
యెంచినాడవు చెడ్డ మంచని,
పంచ ప్రాణములందు ప్రేముడి
　　పరమనే? చెపుమా?

"ఆలుబిడ్డల చూతు నంటివి,
ఆలకించిన వారి శోకము
తొలగు విద్యలు, తొలగు ధైర్యము,
　　తొలగు నీతైనన్

"కాన నీకై తనువు నోడెకి
వాని నొక్కని జూపి వననగు,

---

1 రామదాసు ప్రచురణలోనూ, రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలోనూ ఈ చరణం "వని"తో ప్రారంభమవుతుంది
2 విశాలాంధ్ర ప్రచురణలో 'కొంచెము'

మానవేశుని యాన తప్పిన
మాయదే జగము?"

లేచి పలికెను పితియ సప్పుడు
"రాచసింగమ! ఒడలి కొాద లిదె!
వేచి యుంటిని బ్రతుకు ఫలముకు,[1]
దొరికె నీనాటన్"

"ఐన, చను" మనె నవనిపతి, డా
మనుడు కొంచము తలచి, యిట్లను,
"పనుపు, భటులను పనికి, నిప్పుడె
పోవ నే నొల్లన్

"వొకటి తలచును నరుడు మది, వే
రొకటి తలచును బ్రహ్మ—వినమే?
పోకరాకల నడుమ నడ్డము
లెన్ని తలపడునో?"

"పొమ్ము, పొ" మ్మనె రేడు, "పొమ్మిట
రమ్ము, యీనెల నిండు నంతకు,
లెమ్ము, చాలదె యదను పో, రా,
నడ్డు గడ్డినన్"

## 2

కడలి నడుమను కలదు సేమా
సనెడి ద్వీపము కవుల పుట్టిలు,

1 విశాలాంధ్ర ప్రచురణలో 'ఫలమునకు'

వాడి లే దట యినుని వేడికి
సీతు వలికై నన్

ఋతువు కొక్కొక వింత రూపం
బతుల శోభా భాజనంబై
మతుల కొల్లలనాడు స్వర్గం
బేమొ యాసీమ?

అందు నుం డొక కొండకోనను
సుందరంబగు భవనరాజము,
విందు కనులకు కడలియెదురై
లీల లోలాడన్

పక్షముల నారింజ, ఆలివు
వృక్షషండము లుప్పతిల్లును,
ద్రాక్షపందిరు లింటి పంటలు
సొంపు పచరింపన్

నవ్వులకు నెనరులకు నిత్తె
నివ్వటిల్లెను భవన రాజము,
పువ్వు లెత్తును దాన నిలచిన
మొండు[1] మనసై నన్

తదియచందురు డబ్ధి సోకెను,
చదల విడబడి, యిరులు ప్రాకెను,
అదును కాంచిన రిక్కమూకలు
అంతటను ప్రబలెన్

1 ప్రజాశక్తి ప్రచురణలో "మెండు".

చారుతరముగ పసిడి పమిదల
బారుతీరి వెలింగె జోతులు,
వారియంత్రము తళుకు ముత్తెపు
సరులు విరజిమ్మెన్.

అలరు జిగురుల తోరణావళి
యలుమి చుట్టెను జిలగు కంబము
లుల్లమలరగ నాటపాటలు
పుమ్మిరయి సెలగెన్.[1]

ఘమ్ము, ఘమ్మని కమ్మతావులు
గ్రమ్మె ధూపము లాసవమ్ముల
దుమ్ము రేగెను నాటి పండువ
నిండు వేడుకతోన్

చుట్టలును, మిత్రులును, భ్రాతలు
చుట్టు మూగుచు దమను నడిగిరి
"యెట్టి వింతలు తెచ్చినాడవు
కలదు వేడ్క, గనన్?"

పలికె డామను "యిలను ద్రిమ్మరి
పలు తెరంగుల జనుల గాంచితి,
తెలియ నేర్చితి మర్మమెల్లను
వారి విద్యలలో— —

"యెరుగ రాదని తొల్లి విబుధులు
మరుగు పరచిన మంతనంబుల

1 రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలో 'సెలగన్'.

తిరుగుడులు మరలించి[1], తీసితి
    రాళ్ళ రప్పలలోన్

"వింత నొక్కొక దాని కని, మును
యింత కెక్కుడు లే దనుంటిని,
వింతలన్నిటి వమ్ము జేసెడి
    వింత విను డింకన్—

'ఒకటె' ఆయెను రెండు మూడులు
'ఒకటె' ఆయెను కోటి సంఖ్యలు
పెక్కు లొకటిగ[2] జూచువాడే
    ప్రాజ్ఞు డన వినమే?

"నేను తానను భేదబుద్ధిని
ఛేని[3] కాగ్రహ మొదవి డామను
కానివాడని తలచి ప్రాణము
    గోలుపొమ్మనియెన్

"ఒక్క వింతిది—పిరికి డామను
వొకటి వొకటికి సమము కద? వే
రొకడు నాకయి ప్రాణమిచ్చిన
    చాలదా యనియెన్

"వింత రెండవ దిద్ది—నృపుడును,
చింత వాపుచు వల్లెయనియె, న

1 రామదాసు ప్రచురణలోనూ రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలోనూ 'మరలించితి'

2 రామదాసు ప్రచురణలోను, రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలోను, 'పెక్కు లొకక్కటిగ' ?

3 ప్రజాశక్తి, విశాలాంధ్ర ప్రచురణలలో 'రేని'

నంతరము నే నిటకు వచ్చితి
  వింత కనగోరి——

"కాన, మీరల నెవ్వ డిప్పుడు,
తాను, నేనను బుద్ధి తలపక
తనువు నాకై విడుచువా"డన
  పలుక డొకడైనన్

చింత వంతలు చిత్రితములై
అంత కానగ నయ్యె మోముల
"వింత యిదె"యని పలికె డామను
  వికసితాననుడై

ఆటపాటలు అణగెనంతట,
మాటు మణిగెను భవనరాజము,
చాటు మాటున బారజొచ్చిరి
  సఖులు చుట్టములున్

"కల్లజెప్పితి!" ననియె డామను
"యెల్లరెప్పటియట్ల నలరుం
డుల్లముల!" వారపుడు "కౌను మిమె
  ప్రాణములు" నన్నన్.

"పంజరమ్ముల నున్న పిట్టలు
మంజు లారణ్యములు మరచెను
శింజితములౌ కాలి గొలుసులు
  శిక్షయని మరచెన్

"దారిపోయేవారి కొక్కటి
*కారవాసర కల్పనాయెను
దారి కాదిది దరి యటంచును
తలచు టొక వింత?"

అనుచు, డామను డాసవమ్మల
నాని పాడదొడంగి మించెను
కాని పందువునందు కొండొక
కలక కననయ్యెన్

## 3

ఎల్లి పున్న మనంగ పితియను
యిల్లునందొక విందు మిత్రుల
కెల్లనాయెను, పితియ సప్పుడు
పల్కెనీ పగిదిన్

"తెలియువాడన నొక్కడే భువి,
తెలుపువాడన నొక్కడే భువి,
పలుతెరంగుల సద్గుణాళికి
పట్టు వక్కండే'

"కనియు, నేర్చుట, వానికడనే,
వినియు, నేర్చుట, వానివలనే,
అనగవలెనా, అతడు డామను
డన్న మా టొకటి?

"* కారవాసర = Caravansary = చనుప" ఈ పాదదీపిక రామదాసు ప్రచురణనుంచీ ఉంది 'చనుప' అనే అర్థంమాత్రం రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణ మొదలుగా ఇచ్చి ఉన్నది

"లోకమం దభిమాన ముంచియొ,
నాకు యశ మొనగూర్చ నెంచియొ,
నాకపతి, నామిత్రు డామను
రాక నడ్డడాకొ!

"బ్రతికి, చచ్చియు, ప్రజల కెవ్వడు
ప్రీతిగూర్చునొ, వాడె ధన్యుడు,
బ్రతికి, డామను ప్రజలవేడును[1]
చచ్చి నేనొకడన్

"ముందు టన్నది బొంది మార్చుట,
ముందు భవమున కలుగు విభవము
నంద, ప్రాజ్ఞుడు వగవజెల్లునె
చెప్పుడీ" యనియెన్

"చదివి చెడితివి చాలు"నని నొక
"డొదవె యశ"మని బలికె నొక్కం
"డదనునకు డామనుడు రాడా"
యనియె నొక్కరుడున్

అంత పితియసుకాంత పలికెను
కొంత గద్గదికంబు తోపగ,
"ఇంతవరకును ధైర్యమూనితి
మాటనమ్మికచే,

"వచ్చువాడయితేను డమనుడు
వచ్చునింతకె, చావుకోసము

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'ప్రజల నేలును'—ఇదే సరియేమో!

యిచ్ఛగించుచు తానె వచ్చునె
పిచ్చివాడైనన్

"విత్తునన్నను, వారివారలు
మొత్తమై తా మడ్డుపడరే?
పొత్తులన్నవి సంపదలకే
ఆపదల కగునే!

"వాని ననుశేవింత? పతి తన
చాన నెంచక, బలగ మెంచక
తనువు మిత్రుని కోడుటన్నది
తగవ? ఇది చెపుడా!

"కష్టసుఖముల కలిసి కుడుచుచు
గోష్ఠి[1] ప్రాణంబంచు నెంచుచు
ఇష్టవర్తననున్న చానను
బాయు టొక మహిమా?

"విందు, నీల్గుట నిక్కమౌటను
యెందు, యెప్పుడదైన నొకటని;
యెందరో కలరనెడు వారలు
లేరు చనువారల్

"చదువువారికి వెఱ్ఱిభ్రాంతులు
మెదడుకెక్కిన పాయవందురు,
అదును[2] లేదే దేనికైనను
అంద రెరుగనిదే?

1 రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలో 'గోష్ఠి'.
2 రామదాసు ప్రచురణలో 'అదను'

"పండగలదని కాయ కుడుతురె?
తిండి యెల్లిది నేడు తిందురె?
అండమందున చిలుక కలదని
అరచి జీరెదరే?

"బతకవలసిన కాల ముండగ
బతుక నొల్లమికంటె పుట్టునె
బతుకు దునిమిన బతుకుభారము
పాయదే చెపుడా!

"అది యటుండగ దమనుపై పగ
మది దలంచిన మానవేశుడు
బదులుగా గొనె పాప మెరుగని
ప్రాణి నేలనొకో?

"నరునిచావే కాంక్ష్య మేనియు
నరపతికి, నరులెంద రనుదిన
మరుగువారలు యముని పురమున
కంత తనియడొకో?

"తప్పు వొకయెడ దండ మొకయెడ
వొప్పెయని, నరపతికి దోచిన
వప్పగించెద నాదు ప్రాణము
దమను" కన్నంతన్

నీడ వెలువడి నిలిచె ముందట
వేడ్క మోమున వెల్లివిరియగ
"వీడె దమనుం"డంచు నందర
విస్మయము చెందన్.

ఆమహామతి, అంత వేరొక
యమిత విక్రము డతని కెదురై
"దమన! బతుకుము బతుకు"మనె,
"రే"దనిరి పలువు రటన్.

పలికె నరపతి "మిత్రభావము
సలుపు డిక నీ సఖుడు నీవును!
అలఘు రాజ్యము ప్రేమ సంపద
కలతి యని దలతున్

"విద్య యందలి[1] మాయమర్మము
దిద్ది చెప్పిం దబల యొక్కతె,
విద్య లెరుగని ప్రేమ భరమును
వింతగా చూపెన్

"వినగతగినది వింటి నిచ్చట,
కనగతగినది కాంచినాడను,
మనుజులిద్దరు మగువ యొక్కతె
మాన్యు లీ జగతిన్"

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'విద్యలందలి'

## లవణరాజు కల*

నిండు కొలువున లవణుడను రా
జుండె, జాలిక డొకడు దరి జని,
"దండి నృప! వొక గండుగారడి
కలదు కను" మనియెన్

అల్ల పించము నెత్తినంతనె
వెల్ల గుఱ్ఱం బొకటి యంచల
పల్లటీల్పన నొడయు నుల్లము
కొల్లగొని వచ్చెన్.

వచ్చి నిలిచిన వారువంబును
యచ్చెరువు పైకొన్న చూపున
మచ్చ మేరలు గనక చూసెడి
నృపుని కత డనియెన్

"ఉత్తమాశ్వం బిది నరేశ్వర!
చిత్రగతులను సత్వజవముల
చిత్త మలరించేని, జను మిక
మనసు గల చోట్లన్"

చూపు దక్కఁగ చేష్ట లుడిగెను
చూపరులు వెరగంద నృపునకు,
యేపు చెడి, వొక కొంత తడవున
కెరిగి, నలుగడలన్

---

* 'ఆంధ్ర భారతి' లో ఇది 1911 జనవరిలో అచ్చుపడింది

కలయజూసెను, కల్ల నిజములు
కలక జెందెను మనసులోపల [1]
మెల్ల మెల్లన పూర్వజ్ఞానం
    బల్లుకొని పొడమ

"యేడి జాలకు దేది యశ్వం
బేడు లెన్నో గడచె"నని నృపు,
"దేడు నిమిషము లేవి ప్రభువా!"
    యనిరి తన భృత్యుల్

కలదు లేదను రెండు భ్రాంతుల
కలయగూర్చుకు బుద్ధిబలమున
కాలమహిమకు వెరగుజెందుచు
    లవణు డిట్లనియెన్

"ఏడు నిమిషము లేడు లాయెనొ?
యేడు నిమిషములందు యిమిడెనొ
యేడు లెన్నో? యింత లంతలు
    చింత చేయునొకో!"

యెక్కెనట ఒక మాయగుఱ్ఱం
బొక్క నరపతి మనసు నిలవక,
యెక్కినంతనె పరవశంబై
    యెగసె నది యెటకో!

కన్ను మిన్నును కనని జవమున
కాననంబులు గడిచి యెన్నో,

---

1 విశాలాంధ్ర ముద్రణలో "కలతె జెందిన మనసులోపల"

యెన్న జీవం బొక్కచేనియు
    లేని మరు భూమిన్

మట్టి చనె, సంసృతిని జీవం
బట్లు, యిరులును మరులు వేళకు
తుట్టతుద కొక గున్న యడవిని
    బట్టి, గమనంబున్

మందగించిన, మానవేంద్రుం
డందుకొనె నొక కొమ్మ నల్లుకు
క్రింద ప్రేలెడి తీవ, గుబ్బము
    ముందువలె పరచెన్

అడుగు పుడమిని తగిలినంతనె
బడలియుంటను నిదురపాలై
ఒడలు తెలియక వ్రాలి నరపతి
    వాగె మృతునట్లన్

పిదప జన్మాంతరము తెరగున
నిదుర జారినవేళ, కన్నుల
యెదట వెలసెను వింతలోకము
    సంజ కెంజాయన్

వెలుగునీడలు కనుల కింపై
మెలగి చెలగెడు నాకసంబున
వేలుమబ్బుల యంచు లంటను
    రగిలె రత్నరుచుల్

పారె పక్షులు పౌఁజు పౌఁజుల,
జీరె కోయిల లొకటి వొకటిని,
దూరి గూడుల బాసలాడెను
పిట్ట లెల్లడలన్

గగన రాజ్యము గ్రమ్మ వేడుక
మగటిమిని తన కళలు గూర్చుచు,
పగలు వెన్నునదన్ని సోముడు
పైనమై వెడలెన్

తాడి వనము తూర్పు కొండను
గొడుగు లెత్తెను, చామరంబులు
నిడిపె జీలుగు, లుడు గణంబులు
దవ్వులను నిలిచెన్

వల్ల గాలులు సాగి యలలుగ
జల్లుజల్లున రాల్చె పూవుల,
ఉల్ల మలరెను, ఆక లొక్కఁటె
బడబవలె నడరెన్

అంత చెవులకు దవ్వు దవ్వుల
వింతగానం బొకటి సోకెను,
సోకినంతనె పూర్వవాసన
సిలిచిన ట్లాయెన్

మరిచె నాకలి, మరలె నిడుములు,
పరవశుండై నృపతి, గానము
దరియ, గాంచెను శ్యామలాంగిని
నొక్కఁ జవ్వనినిన్.

అరమొగిడ్చిన కన్నుగవతో,
వెదరియాడెడి ముంగురులతో,
బెదురు యెరగని బింకమొప్పిన
బెడగు నడకలతో,

కూటికడవను బుజముపై నిడు
వాట మది యొక మురువు గులకగ
పాటపాడెను, పాటలాధరి
వెట్లు చామలకై

పాటపాడెను, చెట్లుచామలు
కోటిచెవులను గ్రోలి యలరగ,
తాటివనమున నాగి చంద్రుడు
తాను చెవియొగ్గన్ [1]

ఎవనిగూరిచి పాట పాడెనొ?
యెవని నామము ధన్య మాయెనొ?
లవణు డను మాటొకటి నాచెవి
తాకినట్లయ్యెన్

## 2

మంచివలె నిది మాయ మగునని
యెంచి, యించుక సంశయించక
కించలన్నియు తొలగి వెంబడి
వేడి యిట్లంటిన్

"వినుము కిన్నరి! నీకు దైవం
బన్ని శుభములు గూర్చుగావుత!

---

1 రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలో "చెవియొగ్గెన్".

నిన్ననుండియు నన్న మెరుగని
యాక లోకవంకన్

అంతకన్నను అధికతర మొక
వింతయాకలి మనసు గ్రాచెను,
యింత అంతని చెప్పనేరక
యిట్లు వెంబడితిన్''

అనగ కన్నియ, తిరిగి మెల్లన
నన్ను కన్నులు విచ్చిచూసెను,
పూర్ణ బ్రహ్మాండాధిరాజ్యము
పూనినట్లయ్యెన్.

చూపి కన్నులు డించి, మది తల
పోసి, మిన్నక తోవసాగెను,
బాసె బింకము బెడగునడకల,
ముగిసె గానంబున్

పండువెన్నెల కుముదవనిపై
నిండుగమ్మిన నీడకై వడి
నిండెమోమున చింత యొక్కటి,
మరల నేనంటిన్

''అన్ని మిడు టాకొన్నవారల
కెన్న సుకృత తమం బటంచును
మున్ను పెద్దలు బల్కి రది నీ
వెరుగకుండుదువే?

భృత్యునై తిని నీదుమూర్తికి
భృత్యునౌదును నీకు సుందరి!

మృత్యుముఖమున నున్న భటునకు
    నన్న మీవలదా?

చన్న బ్రతుకుల కొలిచి కుడిచిన
తెన్ను మనసుకు కొంత తోచెడి,
నిన్న యన్నదె నేడు రేపులు
    అన్య నెట్లగుదున్?

మానమూనిన మరలగలనని
మది దలంపకు "మంటి, కన్నియ,
గమన మించుక మందగించి శ
    రంబువంచి యనెన్

వన్నెమీరిన మేనిపసతో
కన్న మణగెడి రత్నరుచితో
"నన్ను తెలియక నాసచేసెద
    వయ్యో! మాలితనేన్,

అయ్యకోసము కూడుకొందును!
ఇయ్యెలే ననుమాట హృదయము
వ్రయ్యచేసెడు, నాదుభాగ్యము
    కెవరి నేమందున్?"

## 3

అన్నపల్లకు విసంపుభల్లము
కన్న వాడయి మనసు దూసెను
కన్నెకన్నుల నీరుగమ్ముట కాంచి
    ఖిన్నుడనై,

కొన్ని నిమిషము[1] లెన్నియెన్నో
కన్నవిన్నవి ధర్మముల నే
నెన్నుకొని, నొక[2] పరమధర్మము
నపుడు గనుగొంటిన్

మలినవృత్తులు మాలవా రని
కులము వేర్చిన బలియు రొక దే
శమున కొందరి వెలికిదోసిరి
మలినమే, మాల

కులము లేదట వొక్క వేటున
పసరముల హింసించువారికి,
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూర కర్ములకున్

మలినదేహుల మాల లనుచును
మలినచిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణధర్మ మ
ధర్మ ధర్మంబే,

అనెడు నిశ్చయ మాత్మదోపగ
"వినుము కన్నియ!" యంటి యెదురై
"జనులు తెలియక పలుకు మాటకు
జనదు వగవంగన్

"మంచిచెడ్డలు మనుజు లందున
యెంచిచూడగ, రెండె కులములు,

1 విశాలాంధ్ర ప్రచురణలో "నిముషము", 2 అందులోనే "వొక"- ఇదె మేలు

మంచియన్నది, మాలయైతే
   మాలనే, అగుదున్

"తెలివి యొలికెడి తేటకన్నులు
మురువు గులికెడి ముద్దుమోమును
వేల్పుచేడియలైన నేరని
   గాన మాధురియున్,

"విత్తరవు[1] లందైన గనని ప
విత్రరూపపు సౌష్టవంబును,
ఉత్తమోత్తమ జాతి లక్షణ
   యుక్తిసంపదయున్,

"మాలయనువా రున్న, వారల
మందబుద్ధికి వగవవలె తన
యందు లేనికొరంత కలదని
   వగవగానేలా?

"నమ్మ నే ననుమాట తెరవ! భ
యమ్ము వాయుము, కూటి నిడి చే
కొమ్ము నా హృదయంపు రాజ్యము
   నిస్సపత్నముగాన్". [2]

వినియె వ్రీడావిస్మయంబులు
ఆననంబున పొడమి పొరగ
కనుల నెత్తుచు, డించుచును నను
కాంత యిటు బలికెన్

---

1 విశాలాంధ్ర ప్రచురణలో "చిత్తరువు"– ఇదిమేలు
2 ప్రజాశక్తి ప్రచురణలో "నిస్సపత్న్యముగాన్"– ఇదే సరి
అయినా మూలాన్ని సరిదిద్దడం తగదు

"తండ్రి కోసము తెచ్చు కూటిని
—తిండికై యెరు కెట్టు లిత్తును?
పెండ్లియాడిన—పెనిమిటొకనికి
—పెట్ట ధర్మంబౌ [1]

"తడవు ఆయెను తల్లడిల్లుచు
తండ్రి నాకై యెదురు చూసును"
అనుచు నన్ను తొలంగు భావము
అతివ అగుపరచన్,

కరముబట్టి యురంబు యురమున
జేర్చి, ముద్దిడి కురులు దువ్వితి,
తాళవనమును వెడలి చంద్రుడు
పక్కునను నవ్వెన్

"ఆడబోయిన తీర్థ మెదురై
వేడబోయిన వరము వచ్చెను,
పెండ్లియాడెద చంద్రు సాక్షిగ
పెట్టుకూ"దంటిన్

మున్ను వేల్పులు వెన్నచేతను
గొన్న యమృతము కన్న రుచులను
చెన్నుమీరెను కూడు, కన్నియ
చేత నిడినంతన్

"వచ్చితివ యల్లుండ! నీకై
వేచియుంటిని యింత కాలము,

1 ఈ విరామ చిహ్నాలు గురజాడ రామదాసు పంతులుగారి ప్రచురణలో తప్ప మరెందులోనూ లేవు అర్థవ్యక్తికి అవి అవసరమని యెంచి చేర్చడమైంది

యిచ్చితిని, చేకొమ్ము కూతును[1]
ప్రాణ మది నాకున్

"వచ్చితిమి యెటనుండొ, అటబో
నిచ్చ మెండై యుండు మనమున,
పసిడి గొలుసులు, బిడ్డ నాకై
పట్టి నన్నుంచెన్

"ఇహములోపలి మంచి యంతయు
యిమిడియున్నది దీని ఆత్మను,
ముక్తికాంతై తుదకు నీకిది
ముందుగతి చూపున్

"కరపినాడను పరము మరవక
యిహమునందున మనెడు మార్గము[2],
కోటితపముల పుణ్యఫల మిది
కొమ్ము[3] నీ కిస్తిన్.

"మాలనైనను మలిన వృత్తులు
మానుకుంటిని గురువు దయచే,
పొలము లోపల పశుల మేపుచు
పొట్ట పోషింతున్

"మలిన వృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి ౦యావనాంతము,

---

1 గురజాడ రామదాసు ప్రచురణలో 'కూతుల' 2 విశాలాంధ్ర ప్రచురణలో 'మర్మము' 3 విశాలాంధ్ర ప్రచురణలోనూ, రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలోనూ 'కొమ్మ'.

పల్లెకల దిట, ప్రాజ్ఞు లందలి
ప్రజలు మావారల్

"పాడిపంటలు గలవు, తామర
తంపరలు మా పశుల మందలు,
జంతు హింసను చేయనొల్లము
భూతదయ మతము

"కాని మనుజుని బుద్ధిలోపల
కలవు, తనమే లొరుల కీడును
తలచు వృత్తులు, కానబోయిన
కలచు నెవ్వారిన్

"మాన్పగలిగితి కత్తికోతలు,
మాన్పవశమే, మాట కోతలు?
కత్తి చంపును, మాట వాతలు
మాన వేనాడున్

"నాటునను గలయట్టి యిడుములు
వాటియందును కలవు, ఓరిమి
యేటికైనను మందు, కలిగిన
కలుగు సౌఖ్యంబుల్

"యేలుకొను దొండొరుల, పిరులకు
మిట్టిపడకుడు, కీడుమూడిన
నాడు కుంగకు, దొరుల మేలుకు
పాటుపడు డెపుడున్"

అనుచు పలికెను వేదవాక్కులు
మమ్ము చేతులుబట్టి కన్నియ
తండ్రి, తొల్లిటి ఋషి యితం డని
 తోచ చిత్తమునన్

పండు గెడ్డము, నిండు కన్నుల
నిండ శాంత రసంబు, పలుకుల
కడలి గాంభీర్యంబు, యొడలిని
 దివ్యతేజంబున్,

కలిగి కూచునె రాజఋషివలె
రావికిందను రచ్చశిలపై
కొమ్మలను జొరి చంద్రకాంతులు
 మేన చెదరంగన్

అంతనుండియు కొన్నిపంటలు
కాంతతో నట స్వర్గసౌఖ్యము
లొంది మంటిని, చక్రవర్తుల
 కొమరులను కంటిన్

చిత్తమా కొమరులను తగులుట
కొత్త శృంఖలయంచు మామ ని
వృత్తి మార్గముపట్టి, దేహము
 వాసె యోగమునన్

పల్లె లోపల దొమ్ములాటలు
అల్లుకొనె, ఆనాట నుండియు
యెల్లవారలు పెద్ద లగుటకు
 యెంచి చూడంగన్

సన్నగిల్లెను సాగు పొలమున,
వున్నదెల్లను తిన్న పిమ్మట
తినిరి పెంచిన పశుల చంపుకు,
అవియు కడితేరన్[1],

చెల్లచెదురై పరచి రందరు
యెల్లదిశలను, పరచు ముందర
కొల్లకొని రేనున్న పొలమును
పండి మేముండన్

తెల్లవారిననుండి మేమును
పిల్లలము పడ్డటి పాటులు
ఝల్లుమనియెడు నొడలు, తలచిన
చాల, చెప్పంగన్

అడవియందలి కాయకసురులు
కుడువ నేరక బడలె బిడ్డలు,
అడవి ద్రిమ్మరి కడకు ప్రాణము
చేరి నేనుంటిన్

ప్రాణసఖి ననుపిలచి[2] యప్పుడు
పలికె స్మితముఖియై "వినుండిక
చేయు కార్యము లేదు, చెల్లెను
ముందు గనవలయున్.

"కడకు జేరితి మీ భవంబున,
తడవు లేదిక, మనసు తిప్పుకు

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'కడ తేరన్'. 2 విశాలాంధ్ర ప్రచురణలో 'పిలిచి'

గడగవలె రాబోవు భవమున
　　జ్ఞాన సంపదకై

“కష్టసుఖముల తీరు లెన్న న
దృష్టములు - మన సత్యవర్తన
కాచుగావుత, కావగలిగిన
　　కన్న పసివాండ్రన్

“చింత యుడుగుడు - చితిని జొత్తము
యింతకన్నను భాగ్య మున్నదె!
అంతమున మతి యెట్టు లుండునొ
　　అట్టి గతి గల్గున్

“కలుగు భవములుకూడ నీతో
కలిసి [1] గడుపుచు ముక్తిజెందెద
కలదె నీ ప్రణయాతిరేకము
　　కన్న సద్గతియున్?”

అనుడు, చింతలు వాసి కైకై
జేర్చి జొచ్చితి మపుడు చితి

## 5

పలికె నిట్టుల పటువిషాద స
మాకులేక్షణు డగుచు లవణుడు,
“కలగవల దిది మాయ సర్వం”
　　బనిరి శాస్త్రజ్ఞుల్

1 విశాలాంధ్ర ప్రచురణలో ‘కలసి’

లవణు డనియెను, బోమలు ముడివడ,
"కలగవలదట! కల్ల యిది యట!
కలిగినది లేదన్న యంతనె
తొలగునట వేదల్!

"పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వ మెరగక [1], శుకము లగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్!

"యెప్పటికి అనుభూత మెద్దియొ
అప్పటికి యది నిక్కువంబే,
యెప్పుడో లోకంబు కల్లగు
ననుట యిపు డెట్లో?

"చిత్తమందున కీలితములై
నిత్యఖేదము నిచ్చు తలంపుల
నెత్తి పైమను- లేరె, హా! యిది
చెప్పగల ప్రాజ్ఞుల్?

"యెక్కడిది, ఆ మాయదేశం
బెక్కడుందురు నాదు బిడ్డలు?
ఒక్కరైనను జూపలేరే
నాదు ప్రాణసఖిన్?"

నృపుడు యిట్లని శోకభార
మ్మాపుకొన శక్యమ్ముగా కిరు

1 విశాలాంధ్ర ప్రచురణలో 'ఎఱుగక'

కేల కన్నులు మూసి, చింతా
   మగ్నుడై యుండెన్

అంత దుర్గద్వార సీమను
వింత కలకల వినగ నయ్యెను,
చెంత ద్వారిక* దేగి నృపునకు
   తెల్పె "నొక మునియున్,

'వారువముపై నొక్క కన్నియ
వచ్చి నిలిచిరి ద్వార సీమను"
"చెచ్చెరను తె"మ్మనియె నరపతి,
   నోట మాటుండన్,

జొచ్చె నాస్థానాంగణం బపు
డప్సరాకృతి నొక్క కన్నియ,
అచ్ఛవర్ణపు టశ్వరాజము,
   బొక్క తాపసుడున్.

పలికె తాపసు "డతుల సౌఖ్యం
బధిప! నీకౌగాక! యవనుడు,
సింధు దేశాధిపుడు, పితృసఖు
   డంపె కానుకగా

"తనదు గాదిలిపట్టి, యీయమ
వినయ విద్యా సద్గుణాన్విత,
కోరె నీ నెయ్యంబు, నీ గుణ
   సంపదకు వలరెన్

---

* రామదాసు ప్రచురణలోనే ఇది ఉంది, మిగతచోట్ల 'ద్వారకుడు'

“పంపె నీ కీ యశ్వరాజం
బెందు లే దిద్దాని కీ”డనె—
చెవిని మాటలు సోకి సోకక
లవణు డక్కన్నెం

జూచి స్మయహర్షాతిరేకము
లాత్మ పెనగొన, డాపి, చేకొని
“వచ్చితివ, నా ప్రాణసఖి!” యని
గద్దియను జేర్చెన్.

———

# కన్యక *

త్రొగటు బంగరు చీరె కట్టి
కురుల పువ్వుల సరులు జుట్టి
నుదుట కుంకుమబొట్టు పెట్టి
సొంపు పెంపారన్,

తొగల కాంతులు కనులు పరపగ
మించు తళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్
రాజవీధిని

పసిడి కడవల పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్ళు పువ్వులు
మోము లందున మొలకనవ్వులు
చెలగ చెలికత్తెల్
వెంట నడిచిరి

అంత పట్టపు రాజు యెదురై
కన్నె సొగసుకు కన్ను చెదురై
మరుని వాడికి గుండె బెదురై
యిట్లు తల పోసెన్

"ఔర, చుక్కల నడుమ చందురు
నట్లు వెలిగెడు [1] కన్నె ముందర

---

* 'ఆంధ్ర భారతి'లో ఇది 1912 అక్టోబరులో అచ్చు పడింది 'శశిలేఖ'లో 1912 నవంబరులో మళ్ళీ

1. 'శశిలేఖ' పత్రిక పాఠంలో 'వెలిగెడి'

వన్నె కాంచిన నగరి సుందరు
  లంద రొక లెక్కా!

"పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరుని రాజ్యం
కట్టవలెరా గండపెండెం
  రసిక మండలిలో"

నాల నడుమను నట్టి వీధిని
దుష్ట మంత్రులు తాను పెండెం
గట్టి కన్నెను చుట్టి నరపతి
  పట్ట మంకించెన్

మట్టి వచ్చిన దైవగతి కిక
దైవమే గతి యని తలంచుక
దిట్టతనమును బూని కన్నియ
  నెట్ట నిటు పలికెన్

"ముట్టబోకుడు, దేవకార్యం
తీర్చి వచ్చెద, నీవు పట్టం
యేలు రాజువు, సెట్టికూతుర,
  నెటకు పోనేర్తున్"

చట్టములు తన చుట్టు నిలవగ
భృత్యవర్గం కాచి కొలవగ
సెట్టి కరములు మోడ్చి రాజుకు
  ఇట్లు వినిపించెన్.

"పట్టమేలే రాజ! బలిమిని
పట్టవలెనా? నీదు సొమ్మే

కాద కన్నియ? నీవు కోరుట
కన్న మరి కలదా
వైశ్యజాతికి వన్నె?

"గాని మన్ననజేసి మమ్ముల
బంధువర్గం, కులం పెద్దల
ధర్మమన్నది అరసి కొంచం[1]
దారి కనబడితే,

"అగ్నిసాక్షిగ కన్నెగైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మెంతెంత వలసిన,
మనుచు మాజాతిన్"

నవ్వి హేళననవ్వు, నరపతి
పల్కె, "నోహో! ధర్మమార్గం
పట్టమేలే రాచబిడ్డకు
సెట్టి కరపడమా!

"రాజు తలచిందేను ధర్మం,
రాజు చెప్పిందెల్ల శాస్త్రం,
రాజులకు పేరైన పద్ధతి
కాద, గాంధర్వం?

"తడవు చెయ్యక, తల్లడిల్లక,
నేడు రేపని గడువు పెట్టక,

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'కొంచెం'

నెమ్మి గోరితివేని కన్నియ
నిమ్ము!
లేకుంటే, పొమ్ము!

"దేగ, పిట్టను పట్టి విడుచున?
వన్నె, యింటికి మరలి నడుచున?
తెమ్ము కానుక లిమ్ము, నీ విటు
వచ్చినందాకన్,

కదల", నంతట సెట్టి పలికెను,
"దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద, రాజా!
శలవు నీ విస్తే—

"యింటి దైవం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
పళ్ళెరం సాగించి వత్తును,
పైని తమ చిత్తం!"

"మంచిదే, మరి నడువు, మేమును
తోడ వత్తుము, దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే
మందుకొన గలము"

## 2

నాడు గుడిలో మండె గుండం
మంట మింటిని[1] ముట్టి యాడగ

---

1 శశిలేఖ పత్రిక పాఠంలో 'మింటను'

కన్న నరపతి గుండె దిగులై
  పట్టు విడజొచ్చెన్

భక్తిపరవశమైన మనసున
దుర్గ నప్పుడు కొలిచి, కన్యక,
ముక్తి వేడుచు వూడ్చి నగలను
  శక్తి కర్పించెన్

దుర్గ కొలనున[1] గ్రుంకి పిమ్మట
రక్తగంధం రక్తమాల్యం
దాల్చి, గుండం చుట్టు నిలిచిన
  జనుల కిట్లనియెన్ —

"అన్నలారా తండ్రులారా
ఆలకించం డొక్క విన్నప
మాలు బిడ్డల కాసుకొనుటకు
  ఆశ లేదొక్కొ
  కులము లోపల?

"పట్ట మేలే రాజు అయితే
రాజు నేలే దైవ ముండడొ?
పరువు నిలపను పౌరుషము మీ
  కేల కలుగదొకో?

'విద్యనేర్చినవాడు విప్రుడు
వీర్యముండినవాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మ పద్ధతి
  మరచి[2], పదవులకై

---

1 శశిలేఖ పత్రిక పాఠంలో 'కొలనుకు' 2 అందులోనే 'మరిచి'

"ఆశచేయక, కాసు వీసం
కలిగివుంటే చాలు ననుకొని,
వీర్య మెరగక, విద్య నేర్చక,
బుద్ధి మాలినచో,

కలగవా యిక్కట్లు? పేర్కొని,
బుద్ధి బలమును బాహుబలమును
పెంచి, దైవమునందు భారం
వుంచి, రాజులలో

రాజులై మనుడయ్య!" ఇట్లని
కన్య సంపతి కప్పు డెదురై
నాలుగడుగులు నడిచి ముందుకు
పలికె నీరీతిన్—

"పట్టపగలే, నట్టి వీధిని
పట్టబోరే జారచోరులు,
పట్టదలచితి వింక నీవాక
పట్టమేలే రాజువట!

"కండ కావర మెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వొక దైవమంటూ,
వుండి వూర్కొనునా?

కులంపెద్దలు కూడి రదిగో!
అగ్నిసాక్షికి అగ్ని అదుగో!
కన్నుకోరిన కన్నె యిదుగో!
జాల మేలాకొ్క?

"పట్టమేలే రాజువైతే
పట్టు నన్నిపు" డనుచు కన్యక
చుట్టిముట్టిన మంటలోనికి
మట్టి తా జనియెన్

పట్టమేలే రాజు గర్వం
మట్టి గలిసెను, కోటపేటలు
కూలి, నక్కల కాటపట్టై
అమరె.

యెక్కడైతే కన్య, మానం
కాచుకొనుటకు మంట గలిసెనొ,
అక్క డొక్కటి లేచె సౌధము
ఆకసము పొడుగై

పట్టమేలే రాజు పోయెను
మట్టి కలసెను కోటపేటలు,
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తు లపకీర్తుల్

———

# కోరుకొండ*

కన్నుల పండు వయ్యె నగరు కాంత కంటివే
విజయరామ నిర్మితమై
విమల ప్రభా దర్శితమై
విబుధబలము కలిమి విజయ
శ్రీల నలరుచూ॥

కొండయిదా గోపురమా
దండినృపతి కాపురమా
రండు, కండు, ఆనంద మొందు
కలదె యింత మెందు॥

కోరుకొండ, కోర్కొండ, కోరకుండ నిత్తు
వరము లూరకుండవలదు రండు
రండనె నట నృపవరుండు॥

శుభవిభవము లభయదాత ఇభరాట్
శ్రీవిజయరామ విభవరున కొసంగి
లలితలక్ష్మి బ్రోవగా॥

మాటమర్మ మెరిగినట్టి మేటికవుల
జాడ లరసి బోటి,
అప్పకవి యమర్చె మాటల ముత్యాలపేట॥

---

* విజయరామ గజపతి 1911లో కోరుకొండలో కట్టించిన ఇంటిలో ప్రవేశించినప్పుడు చేసిన రచన ఇది గురజాడ రామదాసు ప్రతిలోనే ఉంది

## పూర్ణమ్మ*

మేలిమి బంగరు మెలతల్లారా!
కలవల కన్నుల కన్నెల్లారా!
తల్లుల గన్నా పిల్లల్లారా!
విన్నారమ్మా యీ కథను

ఆటల పాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
అమ్మలగన్నా అమ్మల్లారా!
వినరమ్మా మీ రీ కథను

కొండల నడుమను కో నొక టున్నది
కోనకి నడుమా కొల నొక టుంది,
కొలని గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ

పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా,
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది

ఏయేవేళల పూసే పువ్వుల
ఆయావేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ

---

* రచనాకాలం తెలియదు శ్రీ గురజాడ రామదాసు పంతులు ప్రకటించిన (1929) అప్పారావు రచనలలో ఈపాటకు సాధారణ శీర్షికగా ''ఆడపిల్లల పాటలు'' అనేమాట కనిపిస్తూంది

ఏయే ఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ

పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగడుకు ముడివేస్రీ

ఆమని రాగా దుర్గ కొలనులో
కలకల నవ్వెను తామరలు,
ఆమని రాగా దుర్గవనములో
కిలకిల పలికెను కీరములు

ముద్దు నగవులూ మురిపెంబు[1] మరి
పెనిమిటి గాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖ కమలమ్మును
కన్నుల గ్రమ్మెను కన్నీరు

ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాత యని కేలించ,

---

1 గు రా ప్రతిలోనూ, రా వి సా ప్రతిలోనూ 'మురిపెములూ' అని ఉంది

ఆటల పాటల కలియక పూర్ణమ
  దుర్గను చేరీ దుక్కించె[1]

కొన్నాళ్ళకు పతి కొనిపోవచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను,
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
  పుత్తడి బొమ్మకు పూర్ణమకు

పసుపు రాసిరి బంగరుమేనికి
జలకము లాడెను పూర్ణమ్మ
వదినెలు పూర్ణకు పరిపరి విధముల
  నేర్పులు మెరసీ కై చేస్రీ

పెద్దల కప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లీ తండ్రీ దీవించ్రీ,
దీవెన వింటూ పక్కున నవ్వెను
  పుత్తడిబొమ్మా పూర్ణమ్మ!

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ,
అన్నల తమ్ముల నప్పుడు పలికెను
  పుత్తడిబొమ్మా పూర్ణమ్మ

"అన్నల్లారా తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ!
బంగరు దుర్గను భక్తితొ కొలవం
  డమ్మల కమ్మా దుర్గమ్మ

---

1 విశాలాంధ్ర ప్రచురణలో మాత్రం "దుఃఖించె" అని ఉంది. ఇదే సరికావచ్చు గాని కవి రాసింది కాదు

"ఆయావేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్ళన్నీ,
భక్తిని గోపి శక్తికి యివ్వం
దమ్మల కమ్మా దుర్గమ్మ.

"నలుగురు కూచుని నవ్వేవేళల
నాపే రొకతరి తలవండి
మీమీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పే రివ్వండి"

బలబల కన్నుల కన్నీ రొలికెను
పుత్తడిబొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మ

వగచిరి వదినెలు, వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టన్
కాసుకు లోనై అల్లుని తలుచుకు
ఆనందించెను అయ్యొకడె

యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేకిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ బోయెను పూర్ణమ్మ

ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమె
పూర్ణమ యింటికి రావాయె.

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మెకములు మెసల జనెన్
దుర్గకు మెడలో హారము లమరెను
పూర్ణమ యింటికి రాదాయె

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేనిపసల్‌!
హంసల చేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

———

# మనిషి*

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషు లంటే రాయిరప్పల
కన్న కనిష్టం

గాను చూస్తా వేల, బేలా?
దేవు డెకడో దాగె నంటూ
కొండకోనల వెతుకులాడే
వేలా?

కన్ను తెరిచిన కానబడడో?
మనిషిమాత్రుడి యందు లేడో?
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి?

---

* 'కృష్ణా పత్రిక' 1912 డిసెంబరు 14 సంచికలో అచ్చు పడింది చరణాలక్రమం అందులో సరిగా లేదు చివరి మాట 'ముక్తా' అని తప్పు పడింది

# ముత్యాల సరములు*

వెల్లువగ నారోగ్య సంపద
ఉల్ల మలరుప నిచ్చు గావుత
తల్లి భారతమాత పంచమ
జార్జి కెల్లపుడున్

జార్జి సమ్రాట్స్థాపనంబుల
జాజి పూవుల దండ మా [illegible]
రాజరాజులు శిరములందున
దాల్చి మహలయున్

మర్మమెఱుగని ధర్మమహి [illegible]
నిర్మలంబగు నీతిపథమున
పేర్మి ప్రజలను మంచు నేర్పరి
జార్జి మనవలయున్.

భరతఖండం బెన్న డెఱుగని
నిరత శాంతి నొసంగి విద్యల
నెరయ నించిన యాంగిలేయుల
రేడు మనవలయున్

కొల్లబోతగ జంపి శత్రుల
ఢిల్లి పట్టముగట్ట బిలిమి

---

* 1912 లో పంచమ జార్జి చక్రవర్తి ఢిల్లీలో దర్బారు చేసినప్పుడు రాసిన గేయం ఇది గురజాడ రామదాసు ప్రతిలోనే ఉంది

తొల్లి నల్లని దేవ డొక్క-
డజాత శత్రునకున్,

తెల్లవారలు నీతి నిపుణుం
ఢిల్లి పట్టము గట్టి రిపుడే
కల్ల యెరుగని జార్జిరేని
కజాత శత్రునకున్.

నల్లవాడును తెల్లవాడును
నెల్ల శుభముల గూర్చు గావుత
తల్లి మేరీ మహారాజ్ఞికి
జార్జి నరపతికిన్

# దించు లంగరు *

దించు లంగరు దీర్ఘ యుద్ధం
  ధర్మపక్షము మ్రుల్లు చూపెను
నరుల పీనుగ పెంటపోకల
నాటి వెలయును శాంతివృక్షము

పాత సంధులు పాతిపెట్టుము
యుద్ధముల కవి ఉనికిపట్టులు
లోకమంతయు ఏకమై
యుద్ధమునె మారణము చేయును

వచ్చె నిదె బంగారు కాలము
వాంఛ లెల్లను తీరు సుజనుల
కాంగిలేయుల ధర్మరాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్య మిచ్చుచు
సంతతము వర్ధిల్లుగావుత!

* 'కృష్ణా పత్రిక' 1915 అక్టోబరు 30 సంచికలో అచ్చు పడింది

# లంగ రెత్తుము*

విరిగి పెరిగితి, పెరిగి విరిగితి,
కష్టసుఖముల పార మెరిగితి,
పండు నన్నవి ఆశ లెన్నో
యెండి రాలగ బొగిలితిన్

అందజాలని పళ్ళకోసము
అఱ్ఱు జాపితి, నేల పాకిన
చెట్లపళ్ళను విలప[1] లెరుగక
పాదరక్షల మట్టితిన్

తీపి విరిగిన చెరకువలె ఆ
నాటి కోర్కెలు నేడు బెండౌ
టెంచి నవ్వితి, బుద్ధి చపలత
కొత్త కోర్కెల తగిలితిన్

దేవతలతో జోడు కూడితి
రక్కసులతో కూడి ఆడితి
కొత్త మిన్కుల తెలివి పట్టుచు
మంచి చెడ్డల మార్చితిన్

చూతునా! అని చూసితిని, మరి
చేతునా! అని చేసితిని, ఇక
చూడ చేయగ రాని వింతలు
చూపి కన్నులు కట్టితిన్

---

* దీని రచనాకాలం 1914 సెప్టెంబరు మాసం
1 విశాలాంధ్ర ప్రచురణలో 'విలువ లెరుగక'

శత్రు మిత్రుల కిచ్చి నెనరులు
స్నేహ వార్ధిని కొల్ల గొంటిని,
నాటిమిత్రులు తరల శూన్యం
బైన పుడమిని నిలచితిన్ [1]

పంజరంబున నున్న కట్లను
పగల దన్నగలేక స్రుక్కితి,
నింగి పర్వగలేని జన్మము
నీరసంబని రోసితిన్

'ఉసురులకు విసికితివా? యుద్ధము
కలదు, దేశముకొరకు పోరుము "
యుద్ధమా? ఇక నేమి లోకము!
చాలు! చాలును! లంగ రెత్తుము

1 విశాలాంధ్ర ప్రచురణలో 'నిలిచితిన్'

# సు భ ద్ర

## మొ ద టి భా గ ము

పండుగ దండిగఁ బర్వెను
గొండకు నలుగడల, నొక్క కోనను విడిగా
నుండి కిరీటియుఁ గృష్ణుఁడు
మెండగు మంతనములందు మెలఁగెడు వేళన్

కలకల నగవులు మగువల
కలభాషలు నంగదముల గలగల రవముల్
చెలఁగి వనవీధి నొక తఱి
నల విఱిగిన భంగి విఱివి యణఁగె బొదలలోన్

అంతట నొక్కకాంత యల
కాంతము లల్లలనాడఁ దెమ్మెరన్
జెంత వనాంతము న్వెడలి
చేరఁజనెం, దొవకావి చీరపై
బింత మెఱుంగు రశ్మికలు
వెల్పఁగ[1] బంగరు కత్తళంబు, వి
క్రాంత విలాసముల్ నడలఁ
గన్నులఁ జెన్నుల వెల్లిగొల్పుచున్
అడుగడుగున నూపురముల
చడి, వీణియ మీటు మాడ్కి నలుప, నరునకున్

1 విశాలాంధ్ర ప్రచురణలో 'వెల్వఁగ'

గడు హృదయాహ్లాదము నొక
పడఁతుక* యేతెంచి నిలిచెఁ బజ్జను హరికిన్.

ఈ రెండ దాఁకి చదరఁగ[1]
నీరజముఖి తళుకుమేన, నెలఁతుక మించెన్
వారిజ కింజల్క శ్రీ
వారంబున వెలసి మెఱయు వరలక్ష్మిక్రియన్

హరి కెఱఁగి చెలియ నరుఁ గని
మరుఁ గనిన తెఱంగు దోప మదిఁ గొండొక త
త్తరము వొడమ నొయ్యారము
మెరయ నొఱగెఁ దపసి కలిమి మిన్నులు ముట్టన్ [2]

గరిత హొరంగుగొల్పె నరు
కన్నులకున్ మిఱుమిట్లు, చూడ్కుల
మ్మరుని కటారులై పొడువ
మర్మము, దిగ్భ్రమ మావహిల్లె, సుం
దరి ధను వూను సోయగము
ధైర్యము ద్రిప్పె, నినుండు దోచె మో
మరయ, నెఱుంగఁ డిట్టి యప
మాద్భుత విక్రమ మెట్టివోరులన్

"అమ్మా!" యని చెలి శిరమున
నెమ్మి గరం బుంచి పలికె నీరజనేత్రుం
"డిమ్మోని కరుణ సౌభా
గ్యమ్ముల నవ్వారిగాఁగఁ గాంచెద" వంచున్

---

* పాఠాంతరము_ "పడఁతుక యేతెంచి కృష్ణు పజ్జను నిలిచెన్"

1 విశాలాంధ్ర ప్రచురణలో 'చెదరఁగ'

2 ఈ పద్యం ఆ ప్రచురణలో లేదు

కపటమౌనిఁ జూచి కన్నియఁ జూచుచుఁ
గన్నెఁ జూచి కపటమౌనిఁ జూచి,
చిత్త మలరఁ దలఁచెఁ జిత్తజజనకుండు
నేఁడుగంటి నలువ నేర్పటంచు

మొలకనగవు దోప మోమున, వసుదేవ
తనయుఁ డనియె మాయ తపసితోడ,
"కాదె భావి నీకుఁ గరతలామలకంబు
మౌనివర్య! కలదు మనవి యొకటి

"భద్ర యిదె కొలిచె, రైవత
కాద్రిని వరుఁ గోరి, కరుణఁ నరసి తెలుపుఁడీ!
రుద్రుఁ డగునొ, వరుణుఁడొ, ని
ర్ణిద్రపరాక్రముఁడు నరుఁడొ, నీరజభవుఁడో!"

ఱెప్పల డాఁచిన నగవులు
ముప్పిరిగొని ముందు కుబుకు ముఖహారుమోమున్
విప్పఁ గనుల వీక్షించుచు,
నెప్పగిదినిఁ బలుకనేర కింద్రజుఁ డున్నన్.

హరి యనియె "నిట్టి సిద్ధులు
మఱుఁగు పఱతు రమ్మ క్రొత్త మనుజులకడఁ దా
రెఱిఁగిన యర్థం బయినను,
గురుతర పరిచర్యఁ గూడి కూర్తురు శుభముల్

"ఘట నాఘటన సమర్థులు
గుటిలపు విధి వ్రాఁతనైనఁ గుదురు పరచు వా

కృటిమగల పురుష సింహము
లెట పఱచుఁ గటాక్ష మొదవు నీప్సితము లటన్*

"కేవలనరుడే యీతఁడు
భూవలయము చుట్టి పుణ్యభూము లరయుచున్
రావలసివచ్చె నిట నినుఁ
బ్రోవను, సేవించి వేడ్కఁ బొందుము శుభముల్"

కాంచి నరు సుభద్ర "కంటినా మును వీని"
నన్న శంక మనసు నలమికొనఁగ
"నెఱుఁగకున్న వీని నెఱిఁగినట్లున్నది,
మంచి గూర్చు" ననుచు మదిఁ దలంచె

"అన్న వీని నెన్న, నధికుఁడు కానోపు
నెన్నకన్న వీను చెన్నుఁజూడ
నన్నుఁ బ్రోవ వచ్చె నరరూపమును దాల్చి
మానవైరియంచు మదిని దోఁచె

నరుఁ గూర్చిన నరుఁ గూర్చును,
నరుఁ గూర్పకయున్న నాకు నరుఁడై గురుఁడై
దరిఁజేర్చు, నిహము నోఁచమిఁ
బరసాధనమైనఁ గనుట పాడి దలంపన్

---

* పాఠాంతరము

క ఘటనాఘటన సమర్థులు
నిటలంబున బ్రహ్మవ్రాయు నిర్ణయ ఫక్కిం
బటు నిష్ఠాపాటవమున
నటునిటు సేయంగ నేర్తు రార్తులఁ బ్రోవన్

"పెద్దయన్న నరుని పేరైన విననొల్లఁ
డొరుని కెపుడు నన్ను నొసఁగఁజూచు
గురుల చేతనుండుఁ దరుణీజనము పెంపు
వారు మెచ్చువాఁడె వరుఁడు మరుఁడు

"కింప యేల నాకుఁ గృష్ణుఁడు నాయెడ
నున్నవాఁడు లోక మెన్నువాఁడు
వాని పనుపు సేయ వమ్ముగా దేనాఁడు
యతిని గొలిచి విజయు నధిగమింతు"

అర్జునుండు దలఁచె, నమృతంబుఁ గొనునాఁడు
వెన్నుఁ డెత్తినట్టి వేస మిదియె
విప్పుకన్నులందు వెలయు ప్రసాదంబు
నిప్పు గప్పినట్టి నివురు గాదె?

"పసితనపు టాటపాటల
వినువని విలువిద్య దొడ్డవేడ్క[1] చెలంగన్
గుసుమాస్త్రుఁ డెన్న డెఱుఁగని
యసమాయుధ కౌశలంబు లబ్బె గరితకున్.

"లఘునమనోన్నమనంబును[2]
లఘు రయమును నంగముల విలసితము లగుటన్
సుఘటిత లావణ్యం బీ
జఘనఘనకుఁ దెచ్చికొనని సొరు లమర్చెన్.

---

1 రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణలో 'వేడ్క'

2 విశాలాంధ్ర ప్రచురణలో "లఘు నమనోన్నమనంబును" ఏ పాఠమైనా అర్థం అయోమయం.

"వీరుఁ డన్నవాఁడు వీరంబుగల యిట్టి
భామ నేలు భాగ్య మొదవెనేని
గాల ముందు దనుకఁ గతలందు నుతికెక్క
కడిమి మీఱు సుతునిఁ బడయకున్నె?

"వాసుదేవుఁ డపుడె వాగ్దాన మొనరించెఁ
గొందు దీని నడ్డ మెందఱైన
రాముఁ డొకఁడు దక్క రౌహిణేయునిఁ బోరఁ
గడఁగరాదు గనులు గప్పవలయు"

తలఁచె నిట్లు నరుఁడు, తలఁచినంతనె వచ్చెఁ
దాటిసిడపు జోదు, తప్పటడుగు
మేని వందనంబు మైకంపుఁ గనుమాపు
పండుగాడినట్టి నిండు దెలుప

ఎఱిఁగిరి భద్రయుఁ గృష్ణుడు,
నరుఁ డవనత వదనుఁ డయ్యె, నగి బలరాముం
"డరసితి"ననె, మిము గానక,
దొరకితి రిపు డిచటఁ దోడిదొంగ లిరువురున్

"సరి, సరి, మునియొకఁ డమరెనొ?
మఱి కృష్ణుఁడు మఱచు జగము, మన భద్రన్నన్
వరుఁగోరి తపముఁ జేసెడి,
గురుజనములఁ గన్న సేవ గురుకొనిచేయన్.

"కూర్చుండుఁ డయ్య మీరలు
కూర్చుందము మనము, వింతె కురువీరులలో
నేర్చు మగఁ డతఁ డితం డని
యేర్చుచు వా దిడిరి బాలు రెఱుఁగుదు చెపుమా!

"నరుని యెడఁ బక్షపాతము
పఱుపక యున్నట్టి మాట పల్కుము", పల్కెన్
హరి "యెటు పలుకం జెల్లును
పరులకు? ఈ మేటి తపసి ప్రక్కనె యుండన్

"ఇల యెల్లం గాలించుచు
మలపి మలసి, పురుషవరుల మహిమాన్వితులం
గలసి భవ మీఁదు తెలవులు[1]
తెలియుఁ దగులు మనములోనఁ దివిరి కొనంగన్

"విన్నాఁడట, హరి యీ నాఁ
డున్నాఁ డవతారమెత్తి యుర్విని, యతం
డన్నారఁట నీవే యని,
కన్నారఁగ నిన్ను గాంచఁగా నిటు వచ్చెన్"

గొంతు కొకింత మార్చుకొని
గుంతి[2] సుతుం డనె "నో బలాఢ్య నీ
యంతటి వాని ముం దొరుల
నానె గణింప, మనుష్యమాత్రు లా
వెంత, భవిష్య మెంత! జను
లేల యెఱుంగరో ని న్నెఱింగియున్
సంతత సత్యవర్తనమె
సత్యము జీవుల కన్న ధర్మమున్

"ధర్మ ముండుచోట దైవబలం బుండుఁ,
గలుగ దైవబలము గలుగు జయము,
విఱ్ఱవీఁగు జడుఁడు విజయంబు దన దంచు
మున్న లోకపాలు రెన్నినట్లు

(1) విశాలాంధ్ర ప్రచురణలో "తెలువులు" (2) అందు లోనే 'గొంతి'

"అని మొన నొంచి రక్కసుల
నాత్మ బలంబులె కారణంబుగాఁ
గొని రమరుల్ జయంబునకుఁ
గొండొక యక్ష మెదిర్చి గాలి న
గ్నిని గని మీర లీ తృణము
కేల్కొని త్రోయుఁడు కాల్చుఁ డన్న వా
రనువది గామి, గుర్తెఱిఁగి
రాత్మబలంబుల పారతంత్ర్యమున్

"ఐనను, వృష్ణికుమారులు
పైని గనంగలరు పోటువాసులు, పో రెం
దైన బొసగకున్నె దురభి
మానము కౌరవుల యెడల మల్లడిలంగన్ *

"కల దంతశ్శత్రుభయం
బలఘుబలం బాప్త వేష మతిమానుషమై
యలయించు నెంతవారల
వెలిశత్రుల వెతకువాఁడు వెడఁగు దలంపన్.

"కావున శత్రుని మిత్రుఁగ
నే వెరవున నైనఁ జేయు నేర్పరి బలియుం
డావల నంతశ్శత్రుల
కావర మణఁగింపగలఁడు కాల మలవడన్

"ఎఱుఁగని యి ట్లొరు నడుగుట
మఱుఁగు పఱచి దైవజన్మ, మానుషలీలల్
నెఱపుటగా కీ వెఱుఁగని
పరమార్థం బొందు**గలదె ప్రజ్ఞానిధీ

---

* "మచ్చరిలంగన్" పాఠాంతరము
** "పరమార్థం బొకటి" పాఠాంతరము

"ఎద్దానికైన మీరలు
దిద్దక మముబోంట్లు నిజము తెఱ వెఱుఁగుట కా
దద్దారి గనక వట్టివి
సుద్దులు నేర్చితిమి, యగునె సూక్తులను బనుల్.

"వసుదేవుని బిడ్డలు మీ
రసదృశ మహిమానుభావు లాప్తులు చెంతన్
వసియించి, కొంతకాలము,
పసగల సద్వస్తు వొకచి పట్టఁదలఁచితిన్.

"కంటిని మిము ధన్యుఁడ నను
కొంటిని, మీవంటివారు కూరుట తపఃఫలం
బంట కదా, ననుఁ గనుఁ డొక
కంటను, గన్నంత నాకుఁ గల్గు శుభంబుల్"

ప్రేమ పెనగొన్న చూపున
రాముఁడు తన తమ్ముఁ జూచి రంజిలి పల్కెన్
"ధీమంతుం డీ తాపసుఁ
డేమందును మనదు భాగ్య మెఱిఁగితి మితనిన్.

"కల రిల నెందఱో యతులు
కాంచి యెఱుంగము వీనియట్టి ని
స్తుల సదసద్వివేకనిధి
సూనృతవాక్యలనాభిరాము స
ల్లలిత శుభానుభావు విమ
లాత్ము విచక్షణు, నిట్టివానిఁ బూ
జలఁ దనియించి కొన్ని దివ
సంబులు నిల్పుట యింత నొప్పదే

"యదువీరులెల్ల నీఘను
నదను లెఱిఁగి భక్తిఁగొల్వ నాత్మజ్ఞానం
బొదవు, భవజలధి గడపెడు
చదురుం దలవడుట పూర్వజన్మఫలమెకా?

"ఎందెందుఁ గలుగు తీర్థము
లందలి మహిమముల[1] నీ మహాత్ముని వలనన్
విందము, పరమార్థంబులఁ
గందము, వీనులకు విందుగద సూనృతముల్

"మన భద్రయు నీ తపసిని
బనిగొని సద్భక్తి భోజ్యభక్ష్యంబులచేఁ
దనిపెడుఁగా కద్దానను
గనకున్నే రాజరాజుఁ గాంతునిఁ గాగన్"

గారాబమొల్క కన్నుల
నా రాముఁడు భద్రఁ గాంచి నరుని కనియె "నీ
నారీమణి రైవతకము
నారాధించిన ఫలంబయో నినుఁ గాంచెన్

"నీ దాసిగ గొని చెలియల
నేదానను లోప మున్న నెఱుఁగఁ దెలుపుచున్
మోదానఁ గొనుఁడు పూజలఁ
గా దనకుఁడు ముద్దు గడపి కారుణ్యముతోన్

"కత్తిమొన బ్రతుకు జోదుల
పొత్తు గదా బ్రహ్మ వ్రాసెఁ బొలఁతుకలకు[2] మా

1 విశాలాంధ్ర ప్రచురణలో 'మహిమలను' 2 అందులోనే 'పొల
తులకును'

యుత్తమ రాజకులంబుల
నెత్తమ్మికి నిశితకరుని నెయ్యము వోరెన్

"బాణాసన తూణ తను
త్రాణము శైశవమునుండి తాల్చుచు నొక వి
న్నాణంపు జోదు తానై
ప్రాణంబుల సరకు గొనదు భద్ర మగటిమిన్

"పుట్టింటనుండు కాలం
బెట్టుగ నున్నఁ జెల్లు నింతికి, మఱి తా
మెట్టిన యింటను మెలఁగెడు
గుట్టు తెలియకున్న నెట్లు కూరు సుఖంబుల్.

"దారుణము క్షత్ర ధర్మం
బీరసముల కిరవు దొల్లి యేర్పఱచిరి, యే
కారణమొ ధర్మకర్తలు
పూరుషులకుఁ జెల్లుఁగాక పొలఁతుల కేలా?

"పారంబులేని యోరిమి,
గూరిమి బాంధవులపట్ల, గురుజనములచో
గౌరవము, భృత్యవర్గము
నేరు పెఱిఁగి యేలుకొంట నెలఁతకు నీతుల్.

"కఱపవలె మీరు భద్రకు
నిరపాయ సుఖంబు లిచ్చు నీతి పథంబుల్
వర మీవలె నెన రెఱిఁగిన
వరవరు మీయట్టి శాంతు నాథుఁ బడయఁగన్"

తమ్ముఁడు పలికె "తథా" స్తని
నెమ్మొగమును వాంచి భద్ర నేత్రాంతములం
జిమ్మె నరునియెడఁ జూపులఁ
గమ్మ విలుతు మాటువెడలు కఱకు శరములన్

అంతట మదిరను గ్రోలెడు
చింత మనమునందు దోప, సీరధ్వజుఁ డా
వింత తపసి వీడ్కొని చనె,
నంతిపురముఁ జేరె భద్ర యత్యుత్సుకయై

# సుభద్ర

## రెండవ భాగము

కస్తూరి గన్నేరు కావి చీర మెఱుంగు
        మేని చాయకు వింత మిసిమిఁ గొలుప
చెలరేగు ముంగుఱుల్ చేర్చికట్టిన జోతి
        యిరులపై రిక్కల కరణి వెలుఁగ
పైటపైఁ దూగాడు పచ్చలహారముల్
        వలదింద్ర చాపంబు చాడ్పుఁ జూప
నిద్దంపుఁ జెక్కుల దిద్దిన పత్రముల్
        మకరాంక బిరుదాల మాడ్కి వఱల

మెఱపు, కెమ్మబ్బులోపల మెఱయునట్లు
వలిపమున మేల్మిమొలనూలు తళుకులీన
భద్ర నడతెంచె బంగరు పళ్ళెరములఁ
బండ్లుఁ బూవులు గొనుచు సపర్యకొఱకు

మగనికడ కేగు నెలఁతకుఁ
దగు నీ కైసేఁత గాక, తపసిని దోడ్తోఁ
నెగఁ జూచుట కాదే! యీ
సొగసరి, నీ ఠీవి నంప సుమశరము వడిన్

యతి నియతిఁ గోలుపోని
వ్రతివను గన్నంత మాత్ర ననిమేషత్వం
బతనువిభూతియుఁ గాంచదె,
యతియై తాఁ బొందఁజూచు టంతయకాదే?

మంచి నటింతురు తన్వక[1]
వంచనపరు లైనవారు, వారిఁ గని జనుల్
మంచనె పాటింతురు! మఱి
వంచన వంచకునె[2] చెఱచి వంచించుఁ దుదన్

యతిమీదికి మతి వోవుట
మతివోవుటగాఁ దలంచి మానిని యెంతో
ధృతిఁ గడఁగె మరులు మరులుప
మతి ద్రిప్పిన కొలఁది జోకు మితి గడచుటయున్

"పొత్తులనుండఁ బెద్ద లిది
పోలు నటంచుఁ దలంచినట్టి యా
పొత్తుఁ దలంప కీ మగువ
పుణ్యవతీ తిలకమ్ము నోఁచె, ము
న్నత్తగఁ గొంతిదేవి నను
నమ్మల కన్నుల పెంపుదక్క యీ
రిత్త తపస్విపై మరులు
రేఁగుట కానక మోసపోయితిన్

"నవ్వదొడంగి రీ గతికి
నా వదినె ల్తల లూపి, ఖిన్నలై
నొవ్వగఁ బల్కఁజొచ్చిరి
కనుంగవ నశ్రులు గ్రమ్మ చేటు, రీ
రవ్వఁ దలంపఁగాని, మది
రాల్పడి గుండె, నెఱింగెనేని యా
కవ్వడి నొచ్చి పల్కనగఁ
గాంచు గదా యని నాదు శీలమున్

---

1 విశాలాంధ్ర ప్రచురణలో "తప్పక" 2 'వంచన వంచకుని'

"ఏడులోకంబుల నెనలేని* విల్లుకాఁ
డెవ్వాఁ డటన్న గవ్వడి యనంగ
సాటి వారల పట్ల సౌహార్ద్ర మొనరించు
మేటి యెవఁడన కిరీటి యనఁగ
నెనరు నేర్పులు గల్గు నెఱజాణుఁ డెవఁ డన్న
నింద్రజుం డని లోక మెన్ని పల్క—
పెద్దలకడ భక్తి పిన్నలయెడ రక్తి
నెరపువాఁ డెవఁ డన్న నరుఁడె యనఁగ

వీను లలరఁగ వినివిని వేడ్క—గదుర
నరుని నా వానిగాఁ గొన్న నాతి నిపుడు
నాకు నాలోన వింతయ్యె నరుని మఱచి
మాయయతి నొక్క—రుని గాంచి మరులుకొంట

"జగదేకవీరునకు నే
నగుదును దగు వీరపత్ని నని తలఁచి మదిం
దగిలి విలువిద్య నేర్చితి
నగవుగదా తపసి కిప్పనముసేఁత కడున్

"పోనొల్లను యతికడ కిఁకఁ
గాని మ్మేమైన, నరుఁడు గానల లోనన్
గాని, యగచాట్లఁ గుందగఁ
గానక నేఁ దిరుగుచుంటిఁ గరిన హృదయనై"

అని కన్నియ దలమటయును
గనుఁగవ నుబ్బొంగి పాఱెఁ గన్నీరు, పరు
ల్గన రాదని పడకింటికిఁ
జని పానుపుఁ జేరి కడు విషాదముఁ జెందెన్

* "విలుకాఁ డెవండని యన్నఁ గవ్వడి యనంగ", పాఠాంతరము

# సుభద్ర

## మూడవ భాగము

""పంచిరి రాచబిడ్డ నొక
  పాంథ తపస్వి సపర్యకై గురుల్
మంచి దలంచి, చేకురక
  మానునె, నీ విటు వారి పంపు ల
జ్జించి పరిత్యజించి నిర
  సించితి వేమొకొ యేమి కీడు శం
కించితివో యటంచు యతి
  కింవల పాల్పడి వేఁగుచుండదే

""తెత్తును నదు నని యతి వా
గ్దత్తము గృష్ణునకుఁ జేసెఁగాని[1] వినుము నీ
తత్తరము మాని జనుమ యు
దాత్తుం డెంతేనిఁ దపసి తప్పునె పలుకుల్

""యతి నొకనిఁ గుడుపఁ జేకఱు
నతివేలంబైన భాగ్య మనఁడే హరి, నీ
మతకరి వదినెల మాటలఁ
గుతుక మఱియు నూరకంట కూడునె చెపుమా

""కాలము దేశము సిద్ధుల
పాలై యాజ్ఞలను మెలఁగుఁ బార్థుని నీకై
లీలమెయిం గొనఁగా యతి
చాలదె? వంతలను మాని చనుమా వేడ్కన్

---

1 విశాలాంధ్ర ప్రచురణలో 'గాన'

"కాదని యాదవ వీరులఁ
గాదని నీ పెద్దయన్నఁ గవ్వడి కొఁగి ని
న్నీఁదగు ధీరుఁడు కావలె
నౌదల మిన్నేఱు దాల్చు నార్యుం డొకఁడే

"కారా దొకొ యతి యీశుఁడు
రారా దొకొ నిన్నుఁ బ్రోవ రమణిరొ వటుఁడై
తా రాఁడొకొ యిటకు నరా
కారంబున నెంత యతికిఁ గరుణ గలిగినన్

"సిగ్గఱవలె నొక్కొక తఱి
నెగ్గులఁ దొలగింపఁ గోరు నింతుయి, దానన్
లగ్గులు చేకుఱు మఱి నే
సిగ్గని నాఁ డూరకున్నఁ జిక్కనె హరియున్

"కోరి వరించితిఁ గాదే
నారాయణు నేను నాఁడు నాతులలోనన్
బేరుఁ బ్రతిష్ఠయుఁ గాంచనె
పాఱుఁ డొకఁడు కాదె నాకుఁ బట్టై నిలిచెన్"

"ఉత్తముఁ డా తపసి యెడన్
బత్తెంతయుఁ గల్గియుంట భావ్యం బైనన్
జిత్తమున నిన్న మొన్నను
గ్రొత్త తలఁపు లేరుపడ్డఁ గొంకితి పోవన్"

# అనుబంధం

'పూర్ణమ్మ' గేయానికి సంబంధించి గురజాడ అప్పారావుగారి స్వదస్తూరీలో ఉన్న మరొక పాఠం లభిస్తూ ఉంది ఇది బహుశా ఆ గేయానికి గల తొలి రూపు అయి ఉంటుంది పత్రికలకు ప్రచురణార్థం పంపేప్పుడు కొన్ని మార్పులు జరిగి ఉంటాయి, రచన మెరుగుదేరి ఉంటుంది అయినా రెండింటినీ దగ్గర పెట్టుకొని సరిపోల్చినప్పుడు, మొదటిదాన్ని చిత్తు అని పూర్తిగా తోసివెయ్యలేము ముఖ్య విషయాల లోనూ, పదాలలోనూ భేదం లేకపోయినా, కొన్ని పదాల రూపాలలో భేదాలు కనిపిస్తాయి వాటిలో కొన్ని మరింత సమంజసంగా ఉన్నట్లు అనిపిస్తాయి కూడా అందుచేత, గురజాడ స్వదస్తూరీలో కొన్ని పాదాల వరకు లభించే దాన్నిబట్టి, మిగత ముద్రణ ప్రతులలోని పాఠాలను బట్టి, మొత్తం గేయాన్ని పునర్నిర్మించి అనుబంధంగా నిలుపుతున్నాను స్వదస్తూరీలో 'పూర్ణమ్మ' అనే శీర్షిక గూడా 'పూర్నమ్మ'గా ఉంది 'దుక్కించె' అనే మాట కూడా ఉండిఉంటుంది. ఇటీవల 'ముత్యాల సరాలు' ప్రకటించిన వాళ్లు దీన్ని "దుఃఖించె" అనే సాధు రూపంగా మార్చి ఉంటారు శబ్ద స్వరూపం తెలియకపోవడంవల్లగాక, వాడుక రూపానికి చేరువగా ఉండేందుకే, గురజాడ ఇలా రాసి ఉంటారు ఆయన చేసిన అనేక ప్రయోగాలలో ఇది ఒకానొకటిగా ఎంచాలేగాని దీన్ని సవరించే బాధ్యత ఎవరూ తమ నెత్తికెత్తుకొని వేసుకోగూడదు అలా చేసినందువల్లనే, ఇతర కావ్యాల మాట అటుంచి, వేమన పద్యాల అసలు రూపం బ్రహ్మ భేద్యమై పోయింది 1947 లో "ముత్యాల సరాలు – చిన్న కథలు" ప్రకటించిన ప్రజాశక్తి ప్రచురణాలయం వారు ఈ పనికి పూనుకొన్నారనిపిస్తుంది సంస్కరణం అనేది గ్రంథకర్త పట్ల అపరాధం అని నా అభిప్రాయం

# పూర్ణమ్మ

మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లుల కన్న పిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను

ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
అమ్మలగన్న అమ్మల్లారా
వినరమ్మా మీ రీ కథను

కొండల నడుమను కో నొక టున్నది
కోనకి నడుమా కొల నొక టుంది
కొలను గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ

పూజారింటను పుట్టిన చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది

ఏయే వేళల పూసే పువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

ఏయే ఋతువుల పండే పళ్ళను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

పళ్ళను మీరిన తీపుల నడలును
పువ్వుల మీరిన పోడుములున్
అంగము లందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్

కాసుకు లోనై తల్లితండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ

ఆమని రాగా దుర్గకొలనులో
కలకల నవ్వేను తామరలు
ఆమని రాగా దుర్గవనములో
కిలకిల పలికెను కీరములు

ముద్దు నగవులూ మురిపెములూ మరి
పెనిమిటిఁ జూచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖ కమలమ్ముకను
కన్నుల గ్రమ్మెను కన్నీరు

ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాత అని కేలించ
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుక్కించె

కొన్నాళ్ళకు పతి కొనిపో వచ్చెను
పుత్తడి బొమ్మను పూర్ణమను
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడి బొమ్మకు పూర్మమకు

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకము లాడెను పూర్ణమ్మ
వదినెలు పూర్ణకు పరిపరి విధముల
నేర్పులు మెరసీ కై చేస్రీ

పెద్దల కప్పుడు మొక్కెను పూర్ణమ
తల్లితండ్రీ దీవించి,
దీవన వింటూ పక్కన నవ్వెను
పుత్తడి బొమ్మ పూర్ణిమ్మ

చిన్నల నందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ
అన్నల తమ్ముల కప్పుడుపలికెను
పుత్తడి బొమ్మ పూర్ణమ్మ

"అన్నల్లారా తమ్ముల్లారా
అమ్మను అయ్యను కానండీ
బంగరు దుర్గను భక్తితొ కొలవం
డమ్మల కమ్మ దుర్గమ్మ

"ఆయా వేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్ళన్నీ

భక్తిని తెచ్చి శక్తికి యివ్వం
డమ్మల కమ్మ దుర్గమ్మ

"నలుగురు కూచుని నవ్వే వేళల
నా పే రొకతరి తలవండి
మీమీ కన్న బిడ్డల నొకతెకు
ప్రేమను నా పే రివ్వండి

బలబల కన్నుల కన్నీ రొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడిబొమ్మ పూర్ణమ్మ

వగచిరి వదినెలు, వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టన్
కాసుకు లోనై అల్లుని చూసుకు
ఆనందించెను అయ్యొకడె

యెప్పటి యట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వుల సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ పోయెను పూర్ణమ్మ

ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్లను గుమిగూడెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
యింటికి పూర్ణమ రాదాయె

చీకటి నిండెను కొండల కోనల
మేతకు మేకములు మెసల జనెన్
దుర్గకు మెడలో హారము లమరెను
పూర్ణమ యింటికి రాదాయె

కన్నుల కాంతులు కలవల చేరెను
మేలిమి జేరెను మేనిపసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ

———